5-6-1992 శుక్రవారం 12 పేజీలు సంపుటి :63 సంచిక :23 విడిప్రతి : రు. 1.50 లు

Regd. No. H.N.L. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



## ఉత్సవం నిరుత్సాహం- ఏర్పాట్లు బ్రహ్మాండం!

నంది అవార్డుల ఉత్సవం నయనానంద కరంగా , రంగరంగ వైభవంగా జరిగింది; సింహపురీయుల సినీ మోజును తనివితీరా తీర్చింది; భాగ్యనగరం నడిబొడ్డో, సర్కారు ముక్కుబడిగా జరిగిపోయే ఈ వెండితెర వెలుగు జాతరను నెల్లూరుకు తరలించుక వచ్చినందుకు జనార్దనరెడ్డి ప్రతిష్ఠ నిల్చింది; అనుక్షణం ప్రాణభయంతో , దుర్భేద్యమైన సెక్యూరిటీ వలయం నుంచి తల బయటపెట్టి చూడకుండా, మద్రాసు నగరం వీడి బయటకు రాకుండా, క్షణమొక యుగంగా గడిపే తమిళనాడు ముఖ్యమంత్రి జయలలితను ఒప్పించి నెల్లూరుకు రప్పించిన ఫలితం దక్కింది. జనార్దనరెడ్డి బలవంతంపై ఆమె చెన్నపట్నం సరిహద్దు దాటింది కాని, లేకుంటే చస్తే వచ్చేది కాదు.

ఎప్పుడో రెండు నెలల క్రితం హైదరాబాదులో జరిగి పోవలసిన ఉత్సవం ఇది. కాని ఈ ఏడాది నెల్లూరీయుల సమక్షంలోనే అవార్డులు పంచి తీరాలని ముఖ్యమంత్రి ధృఢంగా సంకల్పించడం వల్ల, ఇన్నాళ్ళు ఆలస్యమైంది. ముఖ్యమంత్రితో పాటు,

**నెల్లూరులో నంది అవార్డులు**

జిల్లా అధికారులు సైతం ఈ తిరునాళ్లను జగజ్జేయమానంగా జరపాలన్న పట్టుదలతో పనిచేశారు; మాగుంట సుబ్బరామరెడ్డి గారి కళ్యాణోత్సవం , తిరుపతి ప్లీనరీల అనుభవంతో ఏర్పాట్లను అద్భుతంగా చేశారు. కలెక్టరు, ఎస్.పి. శ్రీనేదురుమల్లి పద్మనాభరెడ్డి , కళ్యాణి ఫిలింస్ ప్రసన్న కుమారరెడ్డిలు దాదాపు నెల రోజులపాటు ఏర్పాట్లలో తలమునకలై పనిచేశారు. అందువల్లే దాదాపు లక్షమంది ప్రజానీకం హాజరైనా చిన్నపీసమెత్తు లోపం జరిగినట్లు ఆరోపణ రాలేదు. లాఠీలు ఝుళిపించాల్సిన అవసరమే ఏర్పడలేదు.

సభ ఠంచన్‌గా ఆరున్నరకు ప్రారంభమైంది. అవార్డులు పొందిన తారాజన సందోహాన్నంతటినీ పేరు పేరునా పిల్చి, వేదికపై కూర్చోబెట్టేసరికి ముఖ్యమంత్రులిద్దరూ వచ్చేశారు. ఏర్పాట్లెంత ఆడంబరంగా జరిగాయో, కార్యక్రమమంత సాదాగా -

కొరవ 6 ఎ పేజీలో

## జగన్నాథుడి ఓటమికి అసమ్మతీయుల యత్నం?

ఉపఎన్నికల పోలింగు గడువు సమీపించింది. ప్రచారం చివర దశకు చేరింది. పాదయాత్రలొక ప్రక్క, బహిరంగ సభలు ఇంకొక ప్రక్క, ఉద్రేకాలు రెచ్చగొట్టే పత్రికా ప్రకటనలు మరొకప్రక్క ఉధృతంగా సాగుతున్నాయి. సనత్ నగర్‌లో మర్రి శశిధర్ రెడ్డికి సానుకూలమైన పరిస్థితి ఏర్పడిందని పరిశీలకుల అభిప్రాయం. తెలంగాణాలో అపారంగా వున్న చెన్నారెడ్డి గారి అనుచర బృందం పెద్ద సంఖ్యలో తరలి వచ్చి ఆయన గెలుపుకు కృషి చేస్తున్నది. పార్టీలో ఆయన్ని ఓడించాలని ప్రయత్నించేవారూ ఎవరూ లేరు. తండ్రికి శత్రువులున్నా అది సంతతికి ప్రమాదం కల్పించడం లేదు. ముఖ్యమంత్రి శ్రీ జనార్దన రెడ్డి సైతం ఈ నియోజక వర్గం పట్ల ప్రత్యేక శ్రద్ధకనపరుస్తున్నారు. ఆయనే స్వయంగా ప్రచారం చేశారు కూడా! శశిధర రెడ్డి గెల్చినా, ఓడినా రాష్ట రాజకీయాల పై పెద్ద ప్రభావమేదీ వుండదు గాబట్టి శశిధర రెడ్డి బ్రతికి పోయాడు!

కాని హిమయత్ నగర్ పరిస్థితి అది కాదు. ముఖ్యమంత్రి సీటు ఖాళీ అయితే నేను పోటీకి రెడీ అని జగన్నాథరావు చేసిన ప్రకటన, ఆయన మెడకే ఉచ్చు అయి చుట్టుకున్నది.

**హైదరాబాదు వార్తా కథనం**

జనార్దన రెడ్డిని నైతికంగా దెబ్బ తీయడానికి అసమ్మతీయులు మొదట్లో ఈ ప్రకటనను వాడుకున్నా అప్పుడు పునరాలోచనలో పడ్డారు. ఈ పదవి ధ్యేయంగా పెట్టుకొని రెండున్నర సంవత్సరాల నుంచి అసమ్మతి కార్యకలాపాలు నిర్వహిస్తున్న డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డికి జగన్నాథ రావంటే భయం పట్టుకొన్నది. వివితో

కొరవ 6 ఎ పేజీలో

# కోట్లాది నిధుల వరదతో అరిచే నోళ్లు మూత!

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దన రెడ్డి మూడు రోజుల నుంచి నెల్లూరులో తిరుగుతున్నారు. రాష్ట్ర ప్రభుత్వ పుష్పక విమానం, గంధభేరుండ పక్షి వలె జిల్లా మొత్తం ఎగురుతున్నది. తడ నుంచి అల్లూరు వరకు, వాకాడు నుంచి బుచ్చి వరకు పదుల సంఖ్యలో కార్యక్రమాలు; హెలికాప్టర్ క్రిందకు దిగడం, పైకి ఎగరడం చూస్తుంటే కోడి పిల్లలు కన్పడగానే అమాంతం క్రిందకు దూకే గ్రద్ద జ్ఞాపకం వస్తుంది. ఆ స్పీడు, ఆ పరుగు అందుకోవడం మానవ మాత్రుడికి సాధ్యం కాదు. జనార్దన రెడ్డి రాజకీయ ప్రాభవం వలెనే వుంది ఆయన పర్యటనల తీరు. ముఖ్యమంత్రిత్వం హోదాను, దర్పాన్ని నిలబెట్టే రీతిలో వున్నాయి సభలన్నీ!

ఈసారి జనార్దన రెడ్డి జిల్లా పర్యటన, జిల్లాకు నిజంగా ఉపకరించేది కావడం విశేషం. తన పేరును శాశ్వతంగా నిలిపే పలు పథకాలు ప్రారంభించారు. వీటిలో చెప్పుకోదగ్గది – పెన్నా డెల్టా డ్రైనేజి అభివృద్ధి పథకం. అల్లూరు, కోవూరు, సర్వేపల్లి నియోజక వర్గాల పరిధిలోని లక్షా చిల్లర ఎకరాలను వరద ముంపు నుంచి రక్షించడంతో పాటు, పైర్లకు నీటి మురుగుదల బాధ కూడా తప్పించే పదైనిమిదిన్నర కోట్ల పథకం ఇది. దుగరాజపట్నం, వాకాడు, చిట్టమూరు, కోరవారి సత్రం, సూళ్లూరుపేట ప్రాంతాల లోని ఉప్పునీటి కాలువలపై చెక్‌డ్యాములు నిర్మించే పథకం రెండవది. సముద్రపు ఆటుపోట్లలో ఉప్పునీరు వెనక్కు పోతే ఈ కాలువలకు చెక్‌డాంలు నిర్మించడం వల్ల, వర్షపు నీరు, ఉప్పునీటిలో కలవకుండా నిలువ చేసే వీలు కలుగుతుంది. రైతులు ఈ కాలువలను సాగునీటి కోసం వినియోగించుకో గల్గుతారు.

## ముఖ్యమంత్రి మూడురోజుల పర్యటన

ముఖ్యమంత్రిగా జనార్దన రెడ్డి కీర్తిని చిరకాలం నిలిపే మరొక ముఖ్యకార్యక్రమం – జిల్లా కోర్టు భవనాల నిర్మాణం. వివిధ దశలలో దాదాపు రెండు కోట్ల వ్యయంతో అత్యంతాధునికంగా నిర్మించ బోతున్నారీ భవనాలను. తడ దగ్గర, టూరిజం కాంప్లెక్స్‌కు చేసిన శంకుస్థాపన పులికాట్ దీవి ప్రాముఖ్యతను పెంచుతుంది; బోర్డులు చూచి తృప్తి పడడం తప్ప, నేల పట్టు పక్షుల రక్షిత కేంద్రం ఎక్కడ వుందో తెలియని జిల్లా వాసులు, ఇక్కడి నుంచి అరుదైన ఆ పక్షి జాతుల విన్యాసాలను వీక్షించవచ్చు.

హైదరాబాదు పొలిమేరలు దాటి బయటకు రాని నంది అవార్డుల ఉత్సవాన్ని నెల్లూరీయులకు చూపించి, తరింపజేశారు ముఖ్యమంత్రి. ఆ ఉత్సవం పుణ్యమా అని ఎసి స్టేడియం రోడ్డు మౌంట్ రోడ్డు మాదిరి తయారైంది.

వాగ్దానాలు తప్ప, చేసిన మేలేమి లేదని సణుగుతుండిన విమర్శకుల నోళ్లను ఈ పర్యటన ద్వారా మూత వేయించాడు ముఖ్యమంత్రి. ఆయనీ పదవికి రాకుంటే, జిల్లా పట్ల మక్కువ చూపకుంటే, ఇంకె రెండు తరాల పాటు తలక్రిందులుగా తపస్సు చేసినా జిల్లాకు వచ్చే పథకాలు కావివి. ఏడాదిన్నర కాలం నుంచి చేపల రైతులు ఆందోళన చేస్తుండిన, ఆవేదన చెందుతుండిన కరెంట్ బిల్లుల సమస్యనూ జనార్దన రెడ్డి ఈ పర్యటనలో పరిష్కరింపజేశాడు. రైతుల ముక్కుపిండి, రు. 1.60 పైసల లెక్కన దండుతుండిన యూనిట్ చార్జిని 65 పైసలకు తగ్గించి వేశాడు; అది వద్దనుకునే రైతులకు హార్స్‌పవర్‌కు ఏడాదికి రు. 750 లు చెల్లించే స్వేచ్ఛ కల్పించాడు.

కొరవ 7 పేజిలో

# పినాకిని తీరం

## ఇంతకూ తప్పెవరది?

డాక్టర్ యలమంచిలి శివాజి రాజ్యసభ సభ్యుడు; రైతు సమస్యల కోసం, ముఖ్యంగా గుంటూరు పొగాకు, పత్తి రైతుల కోసం శ్రమించి పనిచేసి రైతు శ్రేయోభిలాషి; విజయవాడ ఆకాశవాణి ప్రాంతీయ వార్తల్లో అనివార్యంగా నిత్యం వినబడే తెలుగుదేశం నాయకుడు. అటువంటి శ్రీ శివాజి తనను ముఖ్యమంత్రి జనార్దన రెడ్డి చెంపలు పగులగొట్టాడని వార్తపై వివరణ ఇవ్వడంలో పడిన అవస్థ జాస్తి ఆశ్చర్యం కలుగుతుంది. డొంక తిరుగుడుగా చెప్పినా, మసిబూసి మారేడు కాయ చేయజూచినా, ఎవ్వరి మనసు నొవ్వకుండా మాట్లాడి తప్పించు కోదలచినా సత్యం దాగదు; సత్యం సత్యమే! ఈ విధంగా త్రిప్పించి మళ్లించి చెప్పినా అందులో నుండి సత్యాన్ని గ్రహించడం కష్టమేమీ కాదు. ఎట్లయితే నేమి నిజం చెప్పినందుకు డాక్టర్ శివాజి అభినందనీయుడు. అదే విధంగా వాస్తవాన్ని నిర్భీకంగా వెంటనే వెల్లడించ కుండా అనవసర వివాదానికి ఆస్కార మిచ్చిన ఆయన బలహీనత అసమర్థనీయం!

ముఖ్యమంత్రి జనార్దన రెడ్డి తన గుంటూరు జిల్లా పర్యటనలో యడ్లపాడు హెలిప్యాడ్ వద్ద డాక్టర్ శివాజీని చెంపలువాయించాడని హిందూ పత్రిక ప్రముఖంగా ప్రకటించింది. ఆ వార్త వచ్చిన రోజు హైదరాబాదులో మహానాడు సభలో వున్న ఎన్టీఆర్‌కు ఆ వార్త చూపబడింది. దానితో ఆయన రెచ్చి పోయి జనార్దన రెడ్డిని అలబడి పదజాలంతో, అనాగరికంగా, మొరటుగా అత్యంత జుగుప్సాకరంగా తిట్టాడు. మృగమన్నాడు, పశువన్నాడు, గాడిద న్నాడు... ఆ సమయంలో నోటికొచ్చిన మాటలన్నీ ప్రయోగించాడు. ముఖ్యమంత్రి చర్యను నిరసిస్తూ మహానాడు చేత ఒక తీర్మానం కూడా చేయించాడు. మహానాడు జరుగు తుండిన రోజుల్లోనే ముఖ్యమంత్రి శివాజీని కొట్టలేదనే వార్త వచ్చింది. తిట్టిన తిట్లు, చేయించిన తీర్మానాన్ని వాపస్ తీసుకోడానికి పరువు అడ్డుపడి తన తొందర పాటుకు, తెలివి తక్కువ తనానికి నాలుక కొరుక్కొని మిన్నకుండి పోయాడు రామారావు.

ముఖ్యమంత్రిని మృగమన్న తానే పశువు అనే భావం కల్గించుకున్నాడ!

జరగాల్సిన గొడవంతా జరిగి పోయిన తర్వాత, ముఖ్యమంత్రికి మసి బూయబడిన తర్వాత, తాపిగా డాక్టర్ శివాజీ ఆ సంఘటనను గూర్చి గుంటూరులో విలేఖరులకు యుక్తి యుక్తంగా వివరణ ఇచ్చాడు. జనార్దన రెడ్డి తనను చెంపలు వాయించలేదట; చనువుతో చెంపలు నిమురుతూ తోడు బ్రతిమలాడాడట! హిందూ విలేఖరి చెంప పగుల గొట్టినట్లు వ్రాయడంలో పొరపాటు లేదట; ఆ వాతావరణాన్ని, ఆ సన్నివేశాన్ని చూచిన ఎవరికైనా ఆ విధంగానే అనిపిస్తుందట! రామారావు గారు ఈ విషయంలో మాట్లాడడంలో తప్పులేదట! – ఈ విధంగా వుంది

కొరవ 11 పేజిలో

✝ ఉత్తరక్రియలు ✝





## కనమర్లపూడి మహాలక్ష్మమ్మగారు

24.5.92 తేది ఆదివారం రాత్రి 8.30 గంటలకు స్వర్గస్థులైనారు

**7.6.92 తేది ఆదివారం 15 వ రోజు "శిలోద్వాసన"**

**8.6.92 తేది సోమవారం 16 వ రోజు "పొత్తర్లు"**

ఆదరింపులు, వైకుంఠ సమారాధన

కావలి కొత్తబజారులోని మా స్వగృహమునందు జరుగును.

కావున తెలియజేయడమైనది.

కుమారులు–కోడళ్ళు

కనమర్లపూడి హనుమంతరావు – అనసూయాదేవి

కనమర్లపూడి కోటేశ్వరరావు – వింధ్యారాణి

అల్లుళ్లు–కుమార్తెలు

బొగ్గరపు కృష్ణమూర్తి – రామసుబ్బరత్నమ్మ

మెంటా చినబాలకృష్ణయ్య – సౌభాగ్యం

# జమీన్‌రైతు

## శిక్ష ఏమిటి ?

హర్షద్ మెహతా సెక్యూరిటీల కుంభకోణం విలువ 3 వేల కోట్ల రూపాయలని రిజర్వు బ్యాంకు అంచనా వేసింది. ఇది కేవలం ప్రాథమిక అంచనా మాత్రమే. పూర్తి నివేదిక అందేసరికి ఆ మొత్తం ఇంకెన్ని వేల కోట్లకు పెరుగుతుందో తెలియదు. పైగా ఇది ఇద్దరు బ్రోకర్లతో పరిమితమైన దర్యాప్తు నివేదిక. బొంబాయి లోని తక్కిన బ్రోకర్లందరి వ్యవహారాలపై దర్యాప్తు జరిపితే, ఇంకెన్ని వేల కోట్ల గోల్మాల్ బయటపడుతుందో, ఇంకెన్ని బ్యాంకులు దివాలా తీస్తాయో తెలియదు.

ఒకరిద్దరు వ్యాపారస్తులు బ్యాంకులను దగాచేసి ఇన్నేసి వేలకోట్ల రూపాయలను తమ చిత్తం వచ్చినట్లు చేతులు మార్చగలిగారంటే, ఈ దేశంలో బ్యాంకులు ఏ రీతిలో పని చేస్తున్నదీ అర్థం చేసుకోవచ్చు. ఒక్క నేషనల్ హౌసింగ్ బ్యాంకు ఈ కుంభకోణంలో 1200 కోట్లు కోల్పోయిందట; స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా అయితే మెహతాకు డబ్బు సమకూర్చడం కోసం రిజర్వు బ్యాంకుకు తప్పుడు లెక్కలు సమర్పించిందట. అదృష్టం బాగుండి వారి డబ్బు తిరిగి వచ్చింది కాని, లేకుంటే 650 కోట్లు గుటకాయస్వాహా అయివుండేవి. విదేశీయుల యాజమాన్యంలోని స్టాండర్డ్ ఛార్టర్డ్ బ్యాంక్ సైతం 755 కోట్ల మొత్తం సమకూర్చిందట. ఈ ఇద్దరు బ్రోకరకు కెనరాబ్యాంక్ 425 కోట్లు, కెనరాబ్యాంక్ మ్యూచ్యువల్ ఫండ్స్ 103 కోట్లు, స్టేట్ బ్యాంక్ ఆఫ్ సౌరాష్ట్ర 175 కోట్లు, ఎస్‌బిఐ క్యాపిటల్స్ సంస్థ 125 కోట్లు ఇచ్చాయి. బ్యాంక్ ఆఫ్ కరద్ 750 కోట్లు కోల్పోయి, దివాలా తీసి ఏకంగామూతపడింది. బొంబాయి మెట్రోపాలిటన్ కోఆపరేటివ్ బ్యాంక్ సైతం అదే దారిలో వుంది. స్టాండర్డ్ ఛార్టర్డ్ బ్యాంకు దివాలా స్థితి తప్పించుకోవడానికి విదేశాల నుంచి వెయ్యి కోట్లు తెచ్చుకుంటున్నదట. మరొక విదేశీ బ్యాంకు –ఎఎన్‌జెడ్ గ్రిండ్లేస్ బ్యాంకు సైతం ఈ కుంభకోణంలో గొంతువరకు కూరుకొని పోయివుంది.

ఇంకొక ప్రక్క షేర్ల మార్కెట్ పాతాళానికి పడిపోయింది. ఏప్రెల్ నెలతో పోలిస్తే, దాదాపు 90 శాతం షేర్ల ధరలు సగానికి సగం పడిపోయాయి. లక్షలాది అమాయక ఇన్వెస్టర్లు షేర్ల జూదంలో చేతులు పెట్టి, వళ్లంతా కాల్చుకున్నారు; తమ సర్వస్వం కోల్పోయారు.

ఇన్నివేల కోట్లు దిగమ్రింగినా, ఇన్ని లక్షల కుటుంబాలలో దీపం ఆర్పినా – హర్షద్ మెహతా మాత్రం బొంబాయిలోని తన రాజప్రాసాదం వంటి భవంతిలో ఖుషీగా కాలం గడుపుతున్నాడు; ఒక్కొక్కటి అరకోటి విలువ చేసే అరడజను విదేశీ కార్లలో కులాసాగా షికార్లు చేస్తున్నాడు; రామ్‌జెత్మలానీ వంటి లాయర్లు అతడిపై ఈగ వాలకుండా రక్షణ కవచంగా నిలబడివున్నారు. అతడి నుంచి ఒక్కటంటే ఒక్క రూపాయి వసూలు చేయడానికి కాని, పట్టి కటకటాల వెనక్కు నెట్టడానికి కాని ఎవరూ ప్రయత్నించడం లేదు. ఆఖరుకు వీరి స్వాహా వల్ల దివాలా తీసిన కరద్ బ్యాంకు డిపాజిటర్ల గోడుకూడా ఎవరూ విన్పించుకోవడం లేదు.

ఇదేమి చట్టం ? ఇదేమి న్యాయం ? ఏమిటీ దారుణం ? యాభై రూపాయల జేబు దొంగతనం చేసిన వాడిని వీధిలోనే పట్టి, కుంగా తన్ని, లాకప్‌లో పెట్టి రోజుల పర్యంతరం కుళ్ల బొడిచి, కోర్టుల చుట్టూ త్రిప్పి, జైలుకు పంపుతారు; వంద రూపాయలు లంచం తిన్న గుమాస్తాను ఎసిబినో, సిబిఐనో పట్టుకొంటే సస్పెండ్ చేసి, విచారణ జరిపి, ఉద్యోగం నుంచి పీకి, జైలుకు పంపి, మానసికంగా చిత్రహింసలు పెడతారు; పాతికవేల గ్రామోదయ పథకం అప్పు తిరిగి కట్టకుంటే బ్యాంకు అధికారులు ఇంటి ముందుకు వచ్చి నానా రచ్చచేసి, కోర్టుకీడ్చి, పరువు తీస్తారు. కాని 3 వేల కోట్లు దిగమ్రింగిన వాడిని ఈ చట్టం, ఈ ప్రభుత్వం, ఈ వ్యవస్థ మహామేధావిగా ఎంచి, గౌరవించి, సత్కరిస్తున్నది. ప్రజాస్వామ్యానికి ఇంతకంటే సిగ్గు చేటైన విషయం వేరొకటి వుందా? హర్షద్, నరోత్తములు బ్యాంకులనీ విధంగా దోపిడీ చేస్తూపోతే, ఇక దేశంలో బ్యాంకింగ్ వ్యవస్థ పట్ల విశ్వాసం మిగులుతుందా?

ఈ వ్యవహారంలో ఒకరిద్దరు బ్యాంకు ఛైర్మెన్‌లను సెలవుపై ఇంటికి పంపినంత మాత్రాన న్యాయం జరగదు. మొత్తం సంఘటనకు బాధ్యులైన ప్రతిఒక్కరినీ తక్షణం అరెస్ట్ చేసి, జైలులో పెట్టి, ఆ తర్వాత విచారణ జరపాలి; వారి ఆస్తులన్నింటినీ జప్తు చేసి, వారి స్వాహాలవల్ల నష్టపోయిన వారికి ఊరట కల్గించాలి; ప్రధాని శ్రీ పి.వి. ఈ విషయంలో స్వయంగా జోక్యం చేసుకొని, తన ప్రభుత్వం డబ్బుండే వారికి గులాము కాదని నిరూపించుకోవడం అవసరం. సిబిఐ దర్యాప్తును శీఘ్రతరం చేసి, దోషులైన బ్యాంకు ఛైర్మెన్ సైతం సాధారణ నేరస్తుల వలె శిక్షిస్తే భవిష్యత్‌లో ఇటువంటి దుర్మార్గాలు జరగకుండా వుంటాయి.

## జమీన్‌రైతు

5-6-1942
8 పేజీలు అణా

### కళ్ళు కాళ్ళు వున్నవా?

నెల్లూరు జిల్లా కో- ఆపరేటివ్ బ్యాంకుకు కొంచం పనిమీద అలస్యంగా వెళ్ళితే అంటే గురిగా సా.2 1/2 గం.కు పోతే గడియారం వైపు టక్ అనిచూచి టైం అయిపోయింది అని పొమ్మన్నారు కడాసీటు గుమాస్తా. నోటీసు బోర్డుమీద కను పరచిన ఆఫీసు గంటల ప్రకారం ఉ. 10 1/2 గం.కు తెరుస్తారని మర్నాడు పోతే 11 1/2 కు కుర్చీమీద పైగుడ్డ మాత్రం వచ్చింది. ఈ గంట ఆలస్యానికి యేమి జెపుతారు అవుద్యోగి?

- ఒక డిపాజిటర్.

### ఆమంచర్ల కృష్ణరావు పంతులు అస్తమయం

నెల్లూరు పౌర ప్రముఖుడు, సింహపురి ప్రథమ రాచకీయ విజ్ఞాని, ప్రథమ జిల్లాబోర్డు అధ్యక్షుడు, ప్రథమ శాసన సభ్యుడు, ప్రజాసేవా పర తంత్రుడైన రావుబహదూర్ ఆమంచర్ల సుబ్బుకృష్ణారావు పంతులువారు 2 తేది నుండి జ్వరపీడితులై 4-6-42 తేది రాత్రి 10-30 గం.కు దివంగతులైరి.

జమీన్‌రైతు పత్రిక పుట్టుకకు వీరే కారకులు. వీరి సలహాతోనే వీరి అధ్యక్షత క్రింద 1929 ఆఖరున పొదిలిలో జరిగిన నె.జి. రైతు సంఘంలో తీర్మానింపబడి 1930 ఫిబ్రవరిలో పత్రిక ప్రారంభింప బడింది. దీనికి ప్రథమంలో వీరెంతో సహాయ పడిరి.

అట్టి నాయక మణివి గోల్పోవుట దురదృష్టము. వీరి యాత్మకు శాంతి చేకూరుగాక. దుఃఖ నిమగ్నులగు అప్త, బంధు, కుటుంబీకులకు మా సానుభూతిము తెలుపుచున్నాము.

***

బస్సుల్లో ఓవర్ లోడ్ చేస్తే యెక్కుతనో ఏ మరుగున్నే గొరిల్లా మాదిరి వుండి చార్జిచేస్తాడు పోలీసు మొగుడు. ఓవర్ లోడ్ వేయకుండా

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

రూల్ ప్రకారం యెక్కించుకుంటే కలె క్షన్ తక్కువంటాడు బస్సు సొంతదారు. ఓవర్ లోడ్ చార్జి చేసి అపరాధం వేస్తే అది నా నెత్తిన్నే రుద్దుకోవాలి. ఓవర్ లోడ్ వేయకుంటే కలెక్షను తక్కువ కాబట్టి అన్‌ఫిట్ అని ఇంటికి ప్యాసు ఇస్తారు. ఏ దేముడి కేడ్చేది!

- ఒక కండక్టరు.

### హిందూ మహమ్మదీయ ఐక్యత తమాషా గాదు. నిజంగానే!

నెల్లూరు కామాటి వీధి ప్రాంతంలో హిందువులు మహమ్మదీయులు ఒకళ్లొకళ్లపై రాళ్ళు వేసుకొన్నారని పోలీసులు హిందువులు 9 మందిని, ముస్లిములు 4గురిని అరెస్టు చేసి, కేసు బెట్టిరి. తే 2-6-42 ది విచారణకు రాగా నెల్లూరు సబ్ రిజిస్ట్రేటు కోర్టులో హిందువులు, మహమ్మదీయులు ఈ క్రింది విధంగా స్టేటుమెంటు నిచ్చిరి.

"హిందువులు, మహమ్మదీయులు ఒకరొకరు అన్నలు దమ్ములు మాదిరి ఉంటున్నాం. మేము రాళ్లు కొట్టుకోలేదు. ఇళ్లలో వుంటే మమ్ములను పోలీసులు అరెస్టుచేసి తెచ్చారు"

కేసు మధ్యలో వుంది. దీనిమీద వాఖ్యానం వెలిగించడానికి వీల్లేదు.

### "ఆడ బోయిన తీర్థ మెదురైన యట్లు"

ఈ మధ్య తిక్కవరపు రామిరెడ్డిగారు నెల్లూరుకు సుమారు మైలు దూరంలో వేలల్లో యెండాకాలమప్పుడు పశువులకు, మనుష్యులకు త్రాగుడు నీటి సౌకర్యార్థమై సుమారు రు 300 లు యెస్టిమేటు వేసికొని బావి త్రవ్వించే దానికి పూనుకొని త్రవ్వబోయేటప్పటి కేదో కట్టుడు బావి కనపడకుండా పూడిపోయి వుండింది బయట పడ్డది. దాన్ని పూడికెత్తి రిపేరు చేయించేందుకు రు4లు మాత్రం పట్టింది. నిజంగా దేవుడు పుణ్యాత్ముల ఔదార్యపు కార్యాల్లో అమితంగా తోడు పడతాడని గట్టిగా నమ్మాలి దీన్నిబట్టి. కావున ఆ 3 వందలు మరోదానికి ఉపకరిస్తుందిలే.

--- ఒక రైతు.

## రాజానా అభివృద్ధిపై మాట్లాడేది?

15 తేది సంచికలో పినాకినితీరం శీర్షికన వెంకటగిరి ముట్టడి గురించి వ్యక్తం చేసిన అభిప్రాయం సరైనదే. వెంకటగిరిలో ముఖ్యమంత్రి పనితీరుపై గాలి ముద్దు కృష్ణమ నాయుడు వంటి వారు ఆ విధంగా మాట్లాడడంలో తప్పులేదు. ఇక్కడి పరిస్థితులపై అవగాహన లేకనో ఎన్‌టిఆర్ మెప్పుకోసమో మాట్లాడి వుండవచ్చు. నల్లపురెడ్డి చంద్రశేఖర రెడ్డి గారి సంగతి అందరికీ తెలిసిందే – అందులో ప్రత్యేకత లేదు. కాని, వెంకటగిరి వాస్తవ్యుడు, మాజీ శాసనసభ్యుడు, వెంకటగిరి రాచకుటుంబీకుడు శ్రీ యాచేంద్ర ముఖ్యమంత్రి గారి అభివృద్ధి పనులను గురించి మాట్లాడడం చాలా విచిత్రంగా వుంది. ఆయన ఎమ్మెల్యేగా వున్న 5 సంవత్సరాలలో జరిగిన అభివృద్ధి పనులు ఏ మాత్రమో వెంకటగిరిలో ఎవరిని అడిగినా చెప్తారు. ఈ ప్రాంతం అభివృద్ధి పట్ల ఇప్పటి వరకు ఆ మాజీ జమీందార్ల కుటుంబం ఏ మాత్రం శ్రద్ధ చూపిందీ ఆయనకు తెలియదా! వారి స్వంత మేనేజిమెంట్‌లో వున్న ఆర్‌విఎం హై స్కూలును ఒక సారి చూస్తే, వారికి వెంకటగిరి పట్ల వున్న అభిమానం ఎంతో అర్థమౌతుంది. ఎప్పుడో, జమీందారీ వున్న రోజుల్లో, 50,60 ఏళ్ల క్రితం వేసిన కుర్చీలు, బల్లలు, ఈనాటికీ మార్పులేదు; అయ్యవార్లకు పిల్లలకు కనీస వసతులు లేవు. భవనం పాడుపడిపోతుంటే పట్టించుకొనే వారు లేరు. పాత విద్యార్థులందరూ కలసి కాలేజి పెట్టమని కోరితే నిరాకరించడమే గాక, విద్యార్థులే స్వంతంగా కాలేజి స్థాపించబోతే సహాయ నిరాకరణ చేసిన మహానుభావులు వీరు.

ఈ రోజా జనార్దనరెడ్డి వెంకటగిరిలో ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు చేపడుతున్నారు. వాటికి సహకరించ వలసింది పోయి, బయట

### జనవాణి

నుంచి వచ్చిన వారితో గొంతు కలిపి బురద చల్లడం వారి సంస్కారాన్ని బయట పెడుతున్నది.

జనార్దన రెడ్డి గారు కూడా, వెంకటగిరి అభివృద్ధి పనులలో స్థానికుల సహకారం తీసుకోవడం, వారిని అందులో భాగస్తులను చేయడం అవసరం. లేకుంటే అభివృద్ధి సక్రమంగా, సాఫీగా జరగదు.

–కలిమిలి శ్రీ హరి

నెల్లూరు

కొరవ 7 పేజిలో



నిత్యం భక్తుల రద్దీతో కిటకిటలాడే రాజరాజేశ్వరి దేవాలయానికి నూతన అలంకారంగా నిర్మించిన కళ్యాణమండపం.

# ప్రైవేట్ స్కూళ్ల పిచ్చి మరీ ముదురుతూంది!

నెల్లూరులో ప్రైవేట్ స్కూళ్ళు, కాలేజీలు మరీ వీధికొకటి, సందుకొకటిగా పుట్టుకొస్తున్నాయి. ఏ వీధిలో చూసినా అవే బోర్డులు; ఏ పత్రిక తెరిచినా అవే ప్రకటనలు . ప్రైవేట్ ఇంగ్లీషు మీడియం స్కూళ్ల వ్యామోహం మనకు తెలిసిందే అయినా, ఈ సంవత్సరం వలె ఈ వ్యామోహం ఎప్పుడూ లేదు. నాలుగు గదుల బాడుగిల్లు దొరికితే చాలు- అక్కడొక స్కూలు వెలిసి పోతున్నది. ఇది వరకటి రోజుల్లో ఎక్కడా ఎందుకూ పనికిరానివారు రాజకీయాలలో చేరిపోయేవారు; ఇప్పుడు స్కూలు పెట్టి బ్రతకడానికి ప్రయత్నిస్తున్నారు. పదవతరగతి పది సార్లు ఫెయిలయినా, 'ప్రిన్సిపల్' అన్పించుకోగలుగుతున్నారు. పెద్ద పెద్ద డిగ్రీలు తగిలించుకున్న మేధావులు నడిపే స్కూళ్ళ కంటే , ఈ గజ్జి మహమ్మదల బడులనబడే అంగళ్ళు జోరుగా జరుగుతున్నాయి కూడా!

ఎవరైనా సర్వే జరిపితే నెల్లూరులో వున్నన్ని ప్రైవేటు బడుల సంఖ్య రాష్ట్రంలో ఇంకెక్కడా లేని సత్యం రుజువై తీరుతుంది.

చిల్లరంగడో, మాంసం కొట్టో పెట్టుకోవాలన్నా పన్నుల శాఖనుంచో, మరో ప్రభుత్వ విభాగం నుంచో అనుమతి తెచ్చుకోవలసి వుంటుంది కాని

## సింహపురి

. బడి పెట్టుకోవడానికి మాత్రం ఎవరి పర్మిషనూ అవసరం లేదు; ఏ వసతి చూపనవసరం లేదు. బల్లలు లేకపోయినా బలపాలు లేకపోయినా, ఆట స్థలం లేక పోయినా అసలు అయ్యవార్లే లేక పోయినా బడిమాత్రం నిక్షేపంగా పెట్టుకోవచ్చు; చిత్తం వచ్చిన ఫీజులు గుంజుకోవచ్చు; ఇష్టం వచ్చిన రీతిలో నడుపుకోవచ్చు! ప్రపంచంలో మరే దేశంలోనూ సరస్వతి ఇంత చవక బారు వ్యాపార వస్తువుగా వుండదు.

మునిసిపల్ స్కూల్లో పిల్లల్ని చేర్పించడమంటె పరువు తక్కువ విషయంగా పరిగణనౌతుందిప్పుడు. ధర్మాసుపత్రికి పోయే దౌర్భాగ్యుడి మాదిరి చూస్తున్నారు అటువంటి వారిని. ఏదో ఒక ఇంగ్లీషు మీడియం స్కూలు పేరు చెప్పుకోవడం దిగువ మధ్యతరగతి వారికీ కష్టం లేదు. ఆ

కొరవ 10 పేజిలో

## సణుగుడు

* రాజేశ్వరమ్మ సింహపురి మహిళలను అయస్కాంతంలా ఆకర్షిస్తూంది!

నెల్లూరులో రాజేశ్వరమ్మ పలుకు బడి, పెరిగిపోతూంది రాజకీయాలలో నెదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ మాదిరి. దేవతలలో దర్గామిట్ట రాజేశ్వరమ్మ ప్రాభవం అంతకంతకూ పెరిగిపోతూవుంది. రోడ్డుప్రక్క , దారినపోయే వారి చందాలతో ఏర్పడిన ఈ రోడ్ సైడ్ టెంపుల్, ఈనాడు జిల్లాలో అత్యధిక జనాకర్షణ గల ప్రదేశంగా తీర్చి దిద్ద బడుతుందని ఎవరూ అనుకోలేదు. మరికొంత కాలం పోతే జన్నవాడ కామాక్షమ్మ , తన భక్తలోకంలోకి ట్రెస్‌పాస్ చేసి నందుకు ఈ తల్లిపై స్వర్గలోకపు సుప్రీంకోర్టులో క్రిమినల్ కేసు దాఖలా చేయవలసి వచ్చినా ఆశ్చర్యం లేదు. ఆ డేంజరపాయం కళ్ళముందు కన్పడుతూనే వుంది. కామాక్షితాయి వారధి కూలిపోయిన తర్వాత రెండు దేవాలయాలతో పోలిస్తే, రాజేశ్వరమ్మను కొలిచే భక్తుల సంఖ్యే ఎక్కువగా వుంది.

చరిత్ర, మహిమల కథలు, శిల్ప సౌందర్యం ఉట్టిపడే ఆలయ నిర్మాణం, ఆదాయం, వసతులు వగైరాలు లేకుండా, కొత్తగా పుట్టుకొచ్చిన ఒక దేవాలయానికి ఇంతటి జనాకర్షణ ఏర్పడటం ఆశ్చర్యపడాల్సిన విషయమే; అందుకు ఆలయ నిర్వాహకుడు రవి రాఘవ రెడ్డి కారకుడున్నా అతిశయోక్తి కాదు. జనం కాళ్లేపట్టుకున్నాడో, గడ్డాలు పుచ్చుకొని బ్రతిమలాడాడో తెలియదు గాని – ఈ నాలుగైదేళ్లలో ఆలయ రూపరేఖలు ఎంతగా మార్చారు రాఘవ రెడ్డి ? ఆకలో లక్ష్మణా అని ఏడ్రిపెట్టినా విన్పించుకోని నాగరిక మానవులు, దేవాలయ నిర్మాణమంటె,

## డోలేంద్ర

పూజలు పునస్కారాలంటె ఇక ఇనప్పెట్టలు బార్లా తెరిచి, రెండు చేతులతో కాసులు జవిరి, దోసిలి నిండా పోయడం మన సంస్కృతి లక్షణం కదా? రాఘవ రెడ్డి వాడుకున్నంత అందంగా, ఆ బలహీనతను జిల్లాలో ఏ దేవాలయమూ వాడుకోలేక పోతున్నది.

అరున్నర లక్షల ఖర్చుతో కొత్తగా కట్టి, ముఖ్యమంత్రి చేత ప్రారంభోత్సవం చేయించుకున్న కళ్యాణ మండపం, రాజేశ్వరమ్మ

## ఎనిమిది అవార్డులు పొందిన 'రే' చిత్రం

# అశని సంకేత్

సత్యజిత్ రాయ్ దర్శకత్వం వహించిన 'అశని సంకేత్' చిత్రాన్ని దక్షిణాదిన విడుదల చేసే హక్కులను జెమినీవారు తీసుకున్నారు. వారే ఆ చిత్రాన్ని మొన్న పత్రికల వారికి చూపించారు. ఈ కలర్ చిత్రం పదకొండు రీళ్ళు.

ఇది1942-43 సంవత్సరాలకు సంబంధించిన కథ. అవి యుద్ధం జరుగుతున్న రోజులు. బెంగాలులో ఒక మారుమూల కుగ్రామం. ప్రపంచ మహా సంగ్రామం జరుగుతున్నా ఆ గ్రామవాసులకేమీ తెలీదు. అప్పుడప్పుడు ఆకాశంలో విమానాలు తిరగడం మినహా. ఆ గ్రామానికి గంగా, అతని భార్య అనంగ చేరారు. ఆ ఊరికి వీరొక్కరే బ్రాహ్మణ కుటుంబం. ఆ ఊరికి అతనే పురోహితుడు, ఉపాధ్యాయుడు, వైద్యుడు. మోతుబరి రైతు విశ్వాస్ అండదండలతో ఒక పాఠశాలను కూడా నడుపుతున్నాడు. అయనే ఈ కుటుంబానికి నెలసరి వెచ్చాలు కూడా యిస్తుంటాడు.

అనంగకు పిల్లల్లేరు. ఊళ్ళో అందరినీ పలకరించే తత్వం. ముఖ్యంగా మట్కీతో ఆమెకు స్నేహం ఎక్కువ. జీవితం సాఫీగా సాగిపోతుంటుంది.

ఒకరోజు దీను అనేఆయన వచ్చి ప్రక్క గ్రామంలో బియ్యంధర పెరిగిందని చెప్తాడు. 'మన రాజా గారు జర్మనులతో యుద్ధం చేస్తున్నారట. సిపాయిలకు బియ్యం పంపటం వల్ల యిక్కడ బియ్యం ధర పెరిగిందట' అంటాడు అమాయకంగా.

గంగా ఈ విషయాన్ని మొదట అంతగా పట్టించుకోలేదు. కాని రాను - రాను - పంటలు పుష్కలంగా పండినా, క్షామం వచ్చే సూచనలు కనిపించాయి.

### స్వర్గీయ కొలను బ్రహ్మానంద రావు

బియ్యం ధరలు ఆకాశానికి అంటుకుంటున్నాయి. గ్రామంలో ప్రశాంత వాతావరణం మారిపోతుంది. రైతులు ధాన్యాన్ని అమ్ముకుని , ఆ తర్వాత పస్తుండ బోతున్నారు. బియ్యం దుకాణాలను లూటీ చేస్తున్నారు. అంతవరకూ గంగాను ఆదుకుంటున్న విశ్వాస్ కూడా ఇక తాను సహాయం చేయలేనంటాడు. మట్కీ కూడా బియ్యం కోసం - అంతవరకూ తాను ఏవగించుకున్న జాదాకు లొంగిపోయి

కొరవ 10 పేజిలో

## నెల్లూరు 3 వ అ.ము. వారి కోర్టులో

EP 288 of 89 లో OS 225/82

శ్రీ సాగ్రేశ్వర స్వామి దేవస్థానం (వూటుకూరు)
రిప్రజెంటెడ్ బై ది మేనేజరు - DHR వాది

1. చిల్లకూరు సుభాషిణి, 2. చిల్లకూరు రాధాకృష్ణారెడ్డి, 3. చిల్లకూరు శ్రీనివాసులు రెడ్డి JDRs ప్రతివాదులు

15.6.1992 తేది పై కోర్టులో ఉదయం 10 గంటల నుంచి సాయంత్రం 5 గంటల లోగా ఈ క్రింది షెడ్యూలు దాఖలా స్థిరాస్తిని బహిరంగముగా వేలము వేయబడును. పాడదలచిన వారు పాడుకొనవచ్చును.

**ఆస్తివివరము**

నెల్లూరు డి.డి. తాలూకు ఇందుకూరు పేట సబ్.డి. ఏరియాలోని మురిపర్తిపాళెం గ్రామంలో మాగాణి పొలం వివరం

| లాటు నెం. | పట్టానెం. | సర్వే నెం. | విస్తీర్ణం ఎ. సెంట్లు |
|---|---|---|---|
| 1 | 16 | 30-C | 0-10 |
| 2 | 16 | 30-E1 | 0-04 |
| 3 | 140 | 30-H | 0-41 |
| 4 | 178 | 43-A | 0-66 |
| 5 | 16 | 43-F1 | 0-12 |
| 6 | 13 | 43-F2 | 0-34 |
| 7 | 16 | 43-G | 0-68 |

**కుల్లూరు 2-35 సెంట్లు హద్దులు :**

తూ. చిల్లకూరు పిచ్చిరెడ్డి మరియు కాటూరి రమణయ్యల భూమి; ద.ప.: పారుదల కాలువ; ఉ: వాగూరు సుబ్బమ్మ భూమి

గమనిక: లాటు నెం. 3.4 భూమి ఆదమానమునకు లోబడి యున్నవి. పదరు యు. 2-35 సెంట్లు 2,3 JDR ల స్వాధీనము యున్న లేటు చిల్లకూరు చంద్రశేఖర రెడ్డి అవి భర్త 1/3 వ భాగము

DHR విలువ Rs. 8000/-
అమీనా విలువ Rs. 23,500/-

కె. విమల
DHR అడ్వోకేటు

## నెల్లూరు ముచ్చట్లు
### విశ్లేషకుడు

### ముఖ్యమంత్రి

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి జిల్లా పర్యటనలో వున్నారు. రేపు (6 తేది) ఉదయం హెలికాప్టర్‌లో వాకాడు నుంచి హైదరాబాదు వెళ్తారు.

### మంత్రులు

ముఖ్యమంత్రే మన వారు కావడంతో మంత్రుల రాకపోకల పట్టించుకునే వారే లేరు.

రవాణామంత్రి, జిల్లా ఇన్‌చార్జి శ్రీ పెంటపాటి రాజా 3 తేది వచ్చారు. జిల్లా ప్లానింగ్ బోర్డు సమావేశంలో పాల్గొన్నారు.

గనుల మంత్రి శ్రీ మాదాల జానకిరాం 4 తేది ఉదయం విదేశీ పర్యటన నుంచి తిరిగి వచ్చారు. నెల్లూరులో ఎన్ని రోజులు వుంటారో, ఎప్పుడు రాజధానికి వెళ్తారో తెలియదు.

మంత్రులు శ్రీ నమరసింహారెడ్డి, శ్రీ పెర్ని కృష్ణమూర్తి, డాక్టర్ కుతూహలమ్మ ముఖ్యమంత్రి కార్యక్రమాలలో పాల్గొని వెళ్లారు.

### కలెక్టర్ సెలవు

కలెక్టర్ శ్రీ కె. రాజా సెలవు పై ముసోరి వెళ్తున్నారు. అక్కడి ఐఎఎస్ శిక్షణాలయంలో విద్యార్థులకు తన అనుభవాలు చెప్పే విద్యావిషయక కార్యక్రమంతో పాటు, కుటుంబంతో వేసవి విడిది చేసి 17 తేది తిరిగి వస్తారు.

### వర్షం

ఇటీవల సంవత్సరాల్లో రోహిణీ కార్తెకు ముందే జిల్లా వ్యాప్తంగా మంచి వర్షం కురవడం, ప్రజలకు వేసవి తీవ్రత తెలియకుండా వుండడం జరిగేది. ఈ సంవత్సరం రోహిణీ కార్తె పోతున్నా (6 తేది) నెల్లూరులో చినుకులేదు. ఎండల సెగ, విద్యుత్ కొరతతో నెల్లూరు పౌరులు వేపుడులో బొరుగులుగా మాడిపోతున్నారు. వేసవి తాపాన్ని తట్టుకోలేక అల్లాడిపోతున్నారు.

నెల్లూరులో చినుకు లేకపోయినా జిల్లాలో అక్కడక్కడా వర్షం కురుస్తున్నది. మే 29 తేది కలిగిరి, ఆత్మకూరు, చేజర్ల, చిల్లకూరు, పెళ్లకూరులలో ఒక పదునుకు తక్కువ లేకుండా వర్షం కురిసింది. ఉదయగిరి, పొదలకూరు, గూడూరులలో అరపదును చినుకులు.

మే 4, 24 తేదీల్లో కూడా జిల్లాలో పలుచోట్ల చినుకులు పడ్డాయి. పడిన చోట నేల తడిసింది; అంతే!

### మోచర్ల జయంతి

స్వర్గీయ మోచర్ల రామకృష్ణయ్య 88 జయంతి సభ 6 తేది సాయంత్రం టౌన్‌హాల్ రీడింగు రూంలో జరుగుతుంది.

కొరవ 6 బి పేజీలో





# ముఖ్యమంత్రిగా వున్నంత వరకు అందరూ మనవాళ్ళే!

సూళ్లూరుపేటలో చెంగాళమ్మ బ్రహ్మోత్సవాలు, దేవాలయంలో కొత్తగా జరిగిన నిర్మాణాల ప్రారంభోత్సవం పేరుతో సాగుతున్న తతంగం చూస్తుంటే దాని వెనుక ఇంకా పూర్తిగా బయటబడని రాజకీయం దృగ్గోచర మవుతున్నది. ఆ ప్రాంతంలో రాజకీయంగా జరుగబోయే మార్పులు చేర్పులకు ఈ కార్యక్రమాలు అద్దం పడుతున్నాయి.

ఈ రోజు (5 తేది) చెంగాళమ్మ ఆలయ విజయద్వారానికి ఒంగోలు ఎం.పి. శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి, కళ్యాణ మండప ప్రవేశ ద్వారానికి — అమ్మవారి పద్నాలుగు కళల ప్రతిమలకు శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ; భోజన శాలకు శ్రీ పసల పెంచలయ్య ప్రారంభోత్సవాలు చేస్తున్నారు. ఆలయ ధర్మకర్తల సంఘం అధ్యక్షుడు శ్రీ వేనాటి మునిరెడ్డి, ఆయన సోదరుడు, రామచంద్రారెడ్డి గారలు తెలుగుదేశం పార్టీవారు; వారిలో ఒకరు మండల అధ్యక్షుడు; నల్లపరెడ్డి వారికి పరమ ఆప్తులు; కాంగ్రెస్ వ్యతిరేకతకు సూళ్లూరుపేటలో ఆద్యులు.

అటువంటి వారు సుబ్బరామరెడ్డి, పెంచలయ్య గార్లచేతనే గాక, ఏ ముఖ్యమంత్రినైతే నిన్న మొన్నటి వరకు శత్రువుగా పరిగణి స్తుండినారో, చేయిస్తున్నారంటే ఆ జనార్దన రెడ్డి గారి ధర్మపత్ని చేత ప్రారంభోత్సవాల దడబడలు ఏమనుకోవాలి? సుబ్బరామరెడ్డి గారి విషయంలో అపోహకు గాని, దురభిప్రాయానికి గాని ఆస్కారమే లేదు. వేనాటి వారు సుబ్బరామరెడ్డి గారికి చిరకాలంగా సన్నిహితులు, అనుచరులు. వారికి సుబ్బరామరెడ్డి గారి పట్ల భక్తి గౌరవాభిమానాలుండడం సహజం; అదే విధంగా వారి అభీష్టాన్ని తీర్చడం సుబ్బరామరెడ్డి గారి ధర్మం. కాని జనార్దన రెడ్డి, శాసనసభ్యుడు పెంచలయ్యల మీద గౌరవాభిమానాలు ఎప్పటి నుండి ప్రారంభమయ్యాయి? ఎట్లా ఎందుకు ఏర్పడ్డాయి అని తలచుకుంటే ఆశ్చర్యం గలుగుతుంది అంతే కాదు రాజకీయ హఠత్పరిణామం మ్రింగుడు పడడం లేదు.

వేనాటి సోదరులు తమ ధన బలంతో సూళ్లూరుపేటలో కాంగ్రెస్‌ను పాతాళానికి త్రొక్కివేశారు; వారు లేకుంటే అక్కడ తెలుగుదేశమే లేదు; 1989 లో శ్రీనివాసులు రెడ్డి గారి అభీష్టానుసారం కాంగ్రెస్ అభ్యర్థి విజయానికి కృషి చేశారన్నారు గాని, అనాడు ప్రజల్లో తెలుగుదేశం మీద ఏర్పడిన విముఖభావం, కాంగ్రెస్ పట్ల ఏర్పడిన సానుభూతులే కాంగ్రెస్ అభ్యర్థి గెలుపుకు కారణం గాని, తెలుగుదేశం నాయకులు చేసినందు వల్ల కాదు. జనార్దన రెడ్డి అభ్యర్థిని శ్రీనివాసులు రెడ్డి, శ్రీనివాసులు రెడ్డి అభ్యర్థిని జనార్దన రెడ్డి ప్రపంచం తలక్రిందులైనా బలపరుస్తారంటె పిచ్చి వారు తప్ప ఎవ్వరూ నమ్మరు. అటువంటిది కాంగ్రెస్ అభ్యర్థిని, అందులోనూ పసల పెంచలయ్య వంటి విరోధిని శ్రీనివాసులు రెడ్డి బలపరచమని చెప్పాడన్నా, ఆయన అనుయాయులు బలపరచారన్నా నమ్మగలమా?

వేనాటి సోదరులు కాంగ్రెస్‌లో చేరబోతారు అని ఒక వదంతి. దాన్ని నమ్మకుండ వలసిన అవసరం లేదు. గతంలో సమితి అధ్యక్షుడుగా వుండిన కె.కె. వేనాటి సుబ్బారెడ్డి గారు కూడా అనాడు అధికారంలో వుండిన జనార్దన రెడ్డి వర్గంలో చేరాడు. తర్వాత యథాస్థానానికి తిరిగిపోయాడు. అవసరం కొద్దీ చేరాడు, అవసరం తీరిన తర్వాత పోయాడు. ఈ రాకపోకలు మామూలుగా జరిగేవే; కొత్తేమీ కాదు. వ్యాపారులకు, పెట్టుబడిదార్లకు రాజకీయ సిద్ధాంతాలు గాని, పార్టీల అనుబంధాలు గాని ముఖ్యం కాదు. తమ వ్యాపారం, దోపిడి నిర్విఘ్నంగా, నిరాఘాటంగా, సజావుగా జరిగి పోవడమే వారికి ప్రధానం. వ్యాపారము, లాభార్జనే వారి, ఆశయము సిద్ధాంతంగా వుంటాయిగాని రాజకీయ సిద్ధాంతాల పట్ల విశ్వాసం కాదు. తమ వ్యాపారానికి ఏ పార్టీ, ఏ నాయకుడు

### జిల్లా రాజకీయాలు

అవసరమైతే వారు ఆ పార్టీకి ఆనాయకునికి అంకితమై పోయినట్లు నటిస్తారు. వారు అధికారానికి దూరమైతే వీరు వారికి దూరమౌతారు. అది సర్వసాధారణం అయిపోయింది.

వేనాటి సోదరులూ అందుకు భిన్నమని ఎట్లా అనుకోగలం? వారు వ్యాపారస్తులు, సారాయి సార్వభౌములు, లక్షలు, కోట్లకు సంబంధించిన వ్యాపారం వారిది. అటువంటి వారు సాదా చిల్లిపడవను వదలి మంచి బోటును ఎక్కదలచు కోవడంలో ఆశ్చర్యం గాని, అబ్బురంగాని ఏముంది? శ్రీమతి రాజ్యలక్ష్మమ్మను ఆహ్వానించి బ్రహ్మరథం పడుతున్నారంటే, ముఖ్యమంత్రిని మహా ఘనంగా సన్మానించినట్లే అవుతుంది. ఏదో ఒక అవసరం లేకుంటే, ఏదో ఒక పని లేకుంటే, వూపిరి తిరగని పరిస్థితులు ఏర్పడకుంటే వేనాటి సోదరులు ఎత్తుకుంటూనే ఇంత బహిరంగంగా రాజ్యలక్ష్మమ్మ ముగ్ధురాలయ్యేవేడుకలు ఏర్పాటు చేస్తారను కోగలమా? మనసులో ఏదో పెట్టుకొని ముఖ్యమంత్రిని ప్రసన్నం గావించుకోవడానికి అది తగిన మార్గమని తలచి చేస్తున్నారా!.

నాయుడుపేటలో — శ్రీ వి.పి. కుమార్ రెడ్డి శ్రీనివాసులు రెడ్డి గారికి కుడిభుజం. మొన్నమొన్న కూడా జనార్దన రెడ్డిని అసభ్యంగా విమర్శిస్తూ ప్రకటనలు చేసిన వాడు అటు వంటి కుమార్ రెడ్డి తాను వేమారెడ్డి, సి.సి.ఆర్.లతో కలసి జనార్దన రెడ్డి గారిని, బలపరచగలనని పత్రికా ప్రకటన చేశాడంటె అయనలోని ఈ మార్పుకు కారణం ఏమనుకోవాలి? ఆయనకూ వ్యాపార సాహారాలున్నాయా? లేక, ఇతర రాజకీయమా? నాయుడుపేట రాజకీయాల వరకు సి.సి.ఆర్., కుమార్ రెడ్డి చెట్టాపట్టా లేసుకొని వ్యవహరిస్తారనేది తెలుసు. కాని జనార్దన రెడ్డిని బలపరుస్తానని ప్రకటించడం మాత్రం కొత్త, విడ్డూరపు పరిణామమే!

కొరవ 6 ఎ పేజీలో

## జిల్లారాజకీయాలు

(6 పేజీ కొరవ)

తన వాకౌట్లో 'పోలీస్ చిన్నయ్య' గామన్నారు. అతని అవసరం ఒక్క పేనాటి వారికే గాదు. మరి కొందరు ప్రముఖులకు కూడా వుంది. పోలీస్ చిన్నయ్య ఎవరైంది, ఏమైంది, ఇప్పుడు ఆయన లీలలు ఏ విధంగా వుంటేవి అందరికి తెలుసుగదా! ఈ మార్పులన్నీ ద్వారం బార్లా తెరిపించుకోవడానికి సని పెద్ద పుకారు. పిల్లి పల్లమెరుగు, నిజం దేవుడెరుగు. తెలియకుండా అపవాదులు అపాదించడం ఎట్లా ?

జనార్దన రెడ్డి గారి అనుయాయులు ఆయన శ్రేయస్సును, అభ్యున్నతిని దృష్టిలో పెట్టుకొని సలహాలివ్వాలే గాని, సరైన మార్గంలో నడిపించాలేగాని, తమ వ్యక్తిగత స్వార్థ కోణంతో వ్యవహరించడం సమంజసం కాదు. ఆయనకు మంచి పేరు వచ్చేటట్లు, ఆయనను ప్రోత్సహించడం, మంచి పనులు చేయించడం బాగుంటుంది గాని, తమ ప్రాధాన్యతనే పెంచుకోవడానికి ఆయనను వుపయోగపెట్టుకోవడం భావ్యంగా వుండదు. ప్రస్తుతం అట్లా జరుగుతున్నదా? ఈ పరిశీలకుడు భావించలేకున్నాడు. జనార్దన రెడ్డి గారు పాలిటో నీరెటో, అసలెటో నకిలీ ఏదో, చిత్తశుద్ధి ఏదో, సమయానుకూల వర్తన ఏదో ఎరిగి వ్యవహరిస్తున్నాడంటారు. ముఖ్యమంత్రిగా వున్నన్ని రోజులు అందరూ మనవాళ్లేనని పరమ సత్యాన్ని ఆయన ఎప్పుడూ స్పృహలో వుంచుకోవడం మంచిది.

శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ గారు ప్రస్తుతానికి వెంకటగిరి నియోజక వర్గానికి పరిమితం గావడం బాగుంటుంది. దానిని ఎవ్వరూ ఆక్షేపించరు; జనార్దన రెడ్డి ప్రతినిధిగా ఆమె అక్కడ తిరగడం అవసరం కూడా. ఇతర చోట్లకు, ఇతర కార్యక్రమాలకు ఇతరులు ఆహ్వానించడం, ఆమె అంగీకరించి పోవడం జనార్దన రెడ్డి గారి కీర్తి దృష్ట్యా మంచిది కాదేమోనని పిస్తుంది. కార్యార్థులైన వారు అధికార ప్రాపును సంపాదించి, తమ స్వార్థ ప్రయోజనాల సాధనకు ప్రయత్నిస్తారు. దానికి అవకాశమివ్వడం, దురభిప్రాయాలకు ఆస్కారం కల్గిస్తుంది. దుమారం రేగుతున్నది. అందువల్లే ఇంతగా చెప్పవలసి వస్తున్నది?

- మా. రా. వి.

## నెల్లూరు ముచ్చట్లు

### మహానందకు పదవి

స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీ రావిపాటి మహానందను కేంద్ర ప్రభుత్వం, ఇండియన్ టుబాకో డెవలప్‌మెంట్ కౌన్సిల్ సభ్యుడిగా నియమించింది. మూడేళ్లకాల పరిమితి కల్గిన పదవి ఇది.

### ఎంజి బ్రదర్స్‌లో బెల్కో లేజర్ బీమ్

నెల్లూరు ఎంజి బ్రదర్స్ షోరూంను బెల్కో రీజినల్ మేనేజరు శ్రీ ఎన్. ప్రకాశ రావు ఇటీవల సందర్శించారు. లేజర్ బీమ్ వీల్ అలైన్‌మెంట్ విభాగాన్ని ఆయన ప్రారంభించారు. కార్లు, ట్రక్కుల టైర్ల అరుగుదలను నివారించి, పెట్రోలు పొదుపును పెంచే పరికరం ఇది.

### ఒమ్మెనకు రైల్వే సలహా సంఘ సభ్యత్వం

విజయవాడ డివిజన్ రైల్వే వినియోగదారుల సలహా సంఘంలో, శ్రీ ఒమ్మెన సుబ్రహ్మణ్యం సభ్యుడుగా నియమితులైనారు. రెండేళ్లు వుంటుంది సభ్యత్వం.

### మాధవరావు గారి ఇంగ్లీషు స్కూలు

సర్వోదయ కాలేజి (ప్రిన్సిపాల్) శ్రీ వి. మాధవ రావు సిద్ధార్థ అకాడమీ అనే స్కూలు ప్రారంభించారు. శ్రీ బెజవాడ గోపాలరెడ్డి దీనికి రిబ్బను కత్తిరించారు. శ్రీ ఆనం సంజీవ రెడ్డి, వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ శ్రీ కె. వి. నారాయణ రావు. వి.ఆర్. కాలేజి లెక్చరర్ డాక్టర్ పి. రవీంద్ర రెడ్డి మాట్లాడారు.

### మరణాలు

కావలి స్వాతంత్ర్య సమరయోధుడు, ఖద్దరు ధారణా వ్రతుడు, కుహనా రాజకీయాలకు విముఖుడు, మంచి వాడైన శ్రీ చక్కా సత్యనారాయణ గుప్త (67) 2 తేది గుండెపోటుతో హఠాత్తుగా కన్ను మూశారు. ఆయనకు భార్య, ఐదుగురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు వున్నారు.

శ్రీ సత్యనారాయణ గుప్త గతనాలుగు దశాబ్దాలుగా తాలూకా, జిల్లా కాంగ్రెస్ రాజకీయాల్లో సముచిత పాత్రవహించారు. కావలి మునిసిపల్ ఛైర్మన్‌గా 1972 నీటి ఎద్దడిలో రాత్రింబవళ్లు శ్రమించి నిరుపమానంగా సేవ జేసిన వ్యక్తి. కీ.శే. నల్లమోతు చెంచు రామానాయుడు గారి అనుచరుడు.

సత్యనారాయణ గుప్త మరణంతో కావలి ఒక పాత కాంగ్రెస్ వాదిని, స్వాతంత్ర్యయోధుడ్ని, ప్రజాసేవకుణ్ణి కోల్పోయింది. ఆయన మృతికి సంతాప సూచకంగా కావలిలో అంగళ్లు మూతబడ్డాయి. గుప్త మరణానికి నెల్లూరు జిల్లా వాణిజ్య మండలి అధ్యక్షుడు రోటేరియన్ శ్రీ వొమ్మిన సుబ్రహ్మణ్యం తన సంతాపం తెలియజేస్తున్నారు.

* * *

కోఆపరేటివ్ ఇన్‌స్పెక్టరుగా, కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకి వుద్యోగిగా పనిజేసి రిటైరై రైతుగా జీవితాన్ని గడుపుతుండిన రేబాల వాసి శ్రీ కంచారతతల వీరయ్య (82) గత 28 తేది కాలధర్మం చెందారు. ఆయనకు ఇద్దరు కుమారులు ఇద్దరు కుమార్తెలు వున్నారు.

శ్రీ వీరయ్య చల్లాయపాళెం శ్రోత్రియం రైతు. ఇనాందారు నుండి విముక్తి కోసం స్వర్గీయ గ్రిద్దలూరు శంకరయ్య నాయకత్వంలో జరిగిన పోరాటంలో ఆయనకు అన్ని విధాలా చేదోడు వాదోడుగా వుండిన వ్యక్తి ఖద్దరు ధారి.

పై రెండు కుటుంబాల వారికి మా ప్రగాఢ సంతాపం తెలియ జేస్తున్నాము.

సంతపేట, శ్రీ అరణి కందప్ప మేస్త్రి సత్రం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు కుదారి పెంచలయ్య (46) 5 తేది ఉదయం గుండె పోటుతో హఠాత్తుగా మరణించారు. వారి కుటుంబానికి, జిల్ల తరఫున శ్రీ వేగూరు కృష్ణరాజేంద్రరావు సంతాపం తెలియజేస్తున్నారు.

## సణుగుడు

7 పేజీ కొరవ

మారుతుందని. అదే మల్లారెడ్డి గారిప్పుడు అదే భక్తిరసంలో ఓలలాడి, వెంకన్న స్వామి సన్నిధిలో చెంపలు వాయించుకొని వచ్చారట. ఆస్తిక, నాస్తిక వాదాలలో మొదటి దానికే విజయం సిద్ధించిందన్న మాట. నాగరికత పెరిగే కొద్దీ, విజ్ఞానం పెరిగే కొద్దీ, సైన్సుపట్ల అవగాహన పెరిగే కొద్దీ, భౌతిక ప్రపంచపు గుట్టు మట్లు తెలిసే కొద్దీ భక్తి తెరలు తొలగి, హేతువాద సూర్యుడు వెలుగొందవలసిందిపోయి - కన్నదని. దేవుడి పట్ల భయము, విశ్వాసము, ఆసక్తి, అనురక్తి పెరిగిపోతున్నాయి. మోక్షము, మానసిక ప్రశాంతత, ఆధ్యాత్మిక భావన, వగైరావగైరాలు అంతరించి, కోరిన కోరికలు తీర్చే దిక్కు ఏది అన్న అన్వేషణ విస్తృతమౌతున్నది. అందువల్లే అడగగానే అడిగిన వన్నీ ఇచ్చే మహిమలు లేని రంగనాయకుళ్ళు, వేణుగోపాలురు, గోవిందరాజ స్వాములు తెరమరుగై; అపరిమిత మహిమలు కల్గిన శక్తి స్వరూపిణులు జనం మనసులు దోచు కొంటున్నారు. కోరికలు తీరుతాయని దారిన పోయే దానయ్య చెప్పినా చాలు- వెంకయ్య స్వామి అయినా, సుబ్బయ్య స్వామి అయినా, వెనకాముందు చూడకుండా సాగిల పడి పోతున్నారు జనం. దైవభక్తి వ్యాపారంగా మారిపోయింది. లాభనష్టాల బేరీజులో మొగ్గుతూగే దేవతల పట్లనే జనానికి మక్కువ ఇప్పుడు. ఈ సీజన్‌లో రాజేశ్వరమ్మ ఆ భక్తి బిజినెస్‌లో బాగా వృద్ధిలోకి వస్తున్నది. రాఘవరెడ్డి వంటి సేల్స్‌మెన్ దొరకడం ఆమె అదృష్టం.

అయితే అందరు యజమానుల వలెనే ఈ దేవతకు సైతం కార్మికుల పట్ల చిన్నచూపే వున్నట్లుంది. అంత కష్టపడి, ఒళ్ళు వంచి పనిచేసి, ప్రావీణ్యం ప్రదర్శించి, భక్తులనబడే కష్టమర్లను పెంచుతున్నా- పాపం ఈ సేల్స్ మెన్‌కు మాత్రం ఆ కౌన్సిలర్ పదవీ ప్రాప్తం తప్ప, ప్రమోషన్ రూపంలో అనుగ్రహించడం లేదు ఆ తల్లి. భక్తుల మొర వినడంలో బిజీగా వున్న ఆమె, ఈ రాఘ్లైన కూలీని మర్చిపోయిందేమో మరి. రద్దీలేని సమయం చూసి, యజమానురాలి మూడ్ కనిపెట్టి, ఏ ప్రభాత వేళనో రాఘవరెడ్డి తన ప్రమోషన్ విషయం ఆ అమ్మ చెవిలో వేయడం మంచిది. అడగనిదే అమ్మయినా పెట్టదు కదా!

## పంచాంగము

తేది 7 ఆదివారము మృగశిరకార్తె ప్రారంభము

### జూన్ నెల తిథులు

జ్యేష్ట శుద్ధ

| | | | |
|---|---|---|---|
| తే 6 | శని | షష్ఠి రా.గ. | 9.00 వ |
| తే 7 | ఆది | సప్తమి రా.గ. | 6.35 వ |
| తే 8 | సోమ | అష్టమి సా.గ. | 4.15వ |
| తే 9 | మంగళ | నవమి సా.గ. | 2.20 వ |
| తే 10 | బుధ | దశమి ప.గ. | 12.25 వ |
| తే 11 | గురు | ఏకాదశి ప.గ. | 11.00 వ |
| తే 12 | శుక్ర | ద్వాదశి ప.గ. | 9.50 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఏ



### ప్రకటన

మా కక్షి దారుడున్నూ నెల్లూరు జిల్లా కొండాపురం మండలం కొండాపురం గ్రామ కాపురస్తుడున్నూ చిమ్మిలి మాలకొండయ్య కుమార్తు మాల్యాద్రి పేరిటికి సదరు గ్రామ కాపురస్తుడున్నూ చిమ్మిలి చెంచయ్య ఆస్తులను గురించి తే9-10-91 దిన Families arrangement పత్రం వ్రాయించి యిచ్చి పత్రం దాఖలా ఆస్తిని చెందజేసి స్వాధీనము చేసి యున్నాడనియు, ప్రస్తుతం చెంచయ్య అనారోగ్య స్థితిని ఆసరాగా తీసుకొని అతని వల్ల యితరులు ఏలాటి పత్రము లు వ్రాయించు కొన్ననూ చెల్లవని మా కక్షిదారుని బేధపరచవని యిందు వల్ల యావన్మందికి తెలియ చేయడమైనది.

వై.జానకిరామయ్య
అడ్వొకేట్, కావలి



### గుడివాడ సబ్‌కోర్టులో

O.S. No. 1/1972
E.P. No. 89/1987

బిట్వీన్:

యునైటెడ్ ఇండియా ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్

రిప్రజెంటెడ్ బై ఇట్స్ డివిజనల్ మేనేజరు, విజయవాడ -డిక్రీహోల్డరు

అండ్:

అట్లూరి వెంకట నరసింహారావు S/o. లేటు అట్లూరి సీతారామదాసు, వగైరాలు. -జడ్జిమెంటు డెటార్స్

### వేలం ప్రకటన

ఈ క్రింది వుదహరించబడిన షెడ్యూలు దాఖలా ఆస్తులు 22.6.92 తేది వుదయం 10.30 గంటల నుండి పై కోర్టులో బహిరంగముగా వేలము వేయబడును.

### షెడ్యూలు

కృష్ణాజిల్లా - వుయ్యూర సబ్ రిజిష్టరు వారి యిలాకా చిన ఓగిరాల గ్రామములోని జె.డి.ఆర్.యస్. తాలూకు వేలం కావలసిన స్థిరాస్తి వివరములు.

(1) ఆర్.యస్. నెం. 271/2 -యు -.1 - 72 సెంట్లు - 0.696 హెక్టార్లు

భూమికి హద్దులు:

తూర్పు: తుమ్మల నాగేశ్వర రావు భూమి; దక్షిణం: పాలడుగు తిరుపతయ్య అనే వెంకయ్య వారి భూమి; పడమర: బండి గోపాలకృష్ణయ్య భూమి. ఉత్తరం: పాలడుగు నాగరత్నమ్మ భూమి. పంటకాలువ.

డి.హెచ్. ఆర్. వాల్యు: రూ. 30,000/-

అమినా వాల్యు: రూ. 50,000/-

(2) ఆర్.యస్. నెం. : 221/1 -యు. 0.98 సెంట్లు - హెక్టార్లు

భూమికి హద్దులు:

తూర్పు: పంట కాలువ; దక్షిణం: పాలడుగు నాగరత్నమ్మ భూమి; పడమర: బండి గోపాలకృష్ణయ్య భూమి ; ఉత్తరం: పాలడుగు రామయ్య భూమి;

డి.హెచ్.ఆర్. వాల్యు: రూ. 15,000/-

ఎమిన్స్ వాల్యు: రూ. 25,000/-

(3) ఆర్.యస్. నెం. 221/1 - యు 0.28 సెంట్ల భూమి 0.113 హెక్టారు

భూమికి హద్దులు:

తూర్పు: పంటకాలువ; దక్షిణం: 2 వ అయిటం; పడమర: బండి గోపాలకృష్ణయ్య భూమి; ఉత్తరం: పాలడుగు రత్నమ్మ భూమి;

డి.హెచ్. వాల్యుయేషన్: 5,000/-

ఎమిన్స్ వాల్యుయేషన్: 10,000/-

పై భూములకు విదమైన ఎన్‌కంబరెన్స్ లేవు.

బి.యస్. రామచంద్రరావు
అడ్వొకేటు డిక్రీహోల్డరు తరఫున



4 తేదీ రాత్రి నంది అవార్డుల సభలో రఘుపతి వెంకయ్య అవార్డు స్వీకరిస్తున్న కె. విశ్వనాథ్; వేదికపై ముఖ్యమంత్రులిద్దరూ జనార్దన రెడ్డి, జయలలిత

## నెల్లూరు ముచ్చట్లు

6 పేజి కొరవ

### ఎండలు

ఈ వారంలో నెల్లూరులో రికార్డయిన ఉష్ణోగ్రత వివరాలివి –

| తేది | ఫారెన్ హీట్ డిగ్రీలు |
|---|---|
| మే 30 | 105.2 |
| 31 | 103.2 |
| జూన్ 1 | 104.3 |
| 2 | 105.8 |
| 3 | 105.4 |
| 4 | 104.9 |
| 5 | 104.7 |

### ఇంటర్మీడియట్ ఫలితాలు

ఇంటర్మీడియట్ ఫలితాలు అందినంత వరకూ దిగువ యిస్తున్నాము. బ్రాకెట్లలోనివి ఫస్ట్ క్లాసులు.

| కాలేజి పేరు | హాజరైన వారు | ఉత్తీర్ణులైనవారు | శాతం |
|---|---|---|---|
| రత్నం కోచింగ్ | | - | 96 |
| నారాయణ కోచింగ్ | 300 | 248(150) | 82 |
| శ్రీనివాస జూనియర్ కాలేజి | 54 | 39(35) | 76 |
| జి.వి.ఆర్.ఆర్ | 280 | 82(20) | 41 |
| కె.ఎ.సి | 405 | 170(82) | 34 |
| డి.కె.డబ్ల్యు | 485 | 159(90) | 33 |
| విద్యానగర్ | 240 | 82(20) | 33 |
| ఆత్మకూరు | 202 | 60(18) | 29 |
| వి.ఆర్.కాలేజి | 1164 | 313(170) | 27 |

### విఆర్ హైస్కూల్‌లో కో ఎడ్యుకేషన్

నెల్లూరు విఆర్ హైస్కూలులో ఈ ఏడాది నుంచి ఆడపిల్లలను కూడా చేర్చుకుంటున్నారు. మూరేళ్ల వయస్సు తర్వాత ఆడ, మగ కలిసి చదివితే స్కూలుకు శీలభంగమేదీ కలగదని జ్ఞానోదయం కల్గినట్లుంది. 6 నుంచి 10 తరగతి వరకు ఆడపిల్లలను చేర్చుకుంటారట. ప్రతి క్లాసులో ఇంగ్లిషు మీడియం కూడా వుంది. ఆసక్తి కల్గిన వారికి ఆహ్వానమందజేస్తున్నారు హెడ్మాష్టర్ శ్రీ నారసింహారెడ్డి.

ఎంత సంఖ్య పెరిగినా యాజమాన్యం ఎంత అశ్రద్ధ చేసినా చదువు కోవాలనుకొనే పిల్లలకు అప్పటికీ ఉత్తమమైనా స్కూలు విఆర్ హైస్కూలు. వేలు ఖర్చయ్యే ప్రైవేటు స్కూళ్లకంటే, ఎంతో నయం!

కొరవ 6–B పేజీలో



## ఓటమి

(మొదటి పేజీ కొరవ)

ఆయనకున్న సాన్నిహిత్యం దృష్ట్యా ముఖ్యమంత్రి మార్పు అంటే జరిగితే తనకు ఆశాభంగమెదురయ్యే పరిస్థితి వుందని రాజశేఖర్ ఆందోళన చెందుతున్నాడు. ఇప్పుడు అవకాశం చేజారితే ఇక జీవితంలో రాదన్న సంగతి ఆయనకు బాగా తెలుసు. జగన్నాథ రావు ఒకసారి ముఖ్యమంత్రి అయితే, అప్పటికి ఎన్నికలు దగ్గరకు వస్తాయి కాబట్టి, దిగే ప్రశ్న వుండదు. అందువల్ల మొక్కగా వుండగానే త్రుంచి వేస్తే, తనకు భవిష్యత్‌లో పెద్ద అవరోధం తొలగిపోతుందని ఆయన ఆలోచన. ఆ దృష్టితోనే ఆయన జగన్నాథరావు ఓటమికి రహస్యంగా ప్రయత్నిస్తున్నాడని, హనుమంతరావు వంటి వారిని పురికొల్పుతున్నాడని చెప్తున్నారు.

## నంది

(మొదటి పేజీ కొరవ)

సింపుల్‌గా జరిగిపోయింది. స్వాగత నివేదిక సమర్పణాదులు పూర్తి కాగానే అవార్డుల పంపకం ; గంటకు పైగానే పట్టిందది. అందంగా అలంకరించుకున్న ఇద్దరు అమ్మాయిలు నంది బహుమతులు పట్టుకొని వయ్యారంగా వేదిక మధ్యకు తేవడం - జయలలిత చేతులమీదుగా అందించడం - క్రమ శిక్షణతో, క్రమ పద్ధతిలో జరిగిపోయింది. పెద్దగా ఉపన్యాసాలు లేవు. కె. విశ్వనాథ్, దాసరి మాత్రం రెండేసి ముక్కలు మాట్లాడారు. కుమారి జయలలిత స్వచ్ఛమైన తెలుగులో లఘు ప్రసంగం చేశారు. జనార్దనరెడ్డిగారు రాష్ట్ర ప్రభుత్వం సినిమా పరిశ్రమకు చేస్తున్న మేలును క్లుప్తంగా వివరించారు.

అయితే ఉత్సవం ఎంత నయనానందకరంగా జరిగిందో, ఉత్సవానికి విచ్చేసిన జనసందోహానికి అంత నిరుత్సాహం అవరించింది. శ్రీదేవి రావడం లేదని వార్త ధృవపడగానే సగం మంది నీరసపడిపోయారు. అప్పటికీ ఆశచావక, వేదికపై మిలమిల మెరిసే తారామణులను దర్శించి పునీతులౌదామని తపన పడిన వారికి మితిమీరిన సెక్యూరిటీ ఏర్పాట్లు అడ్డం వచ్చాయి. జయలలిత ప్రాణ రక్షణకోసం వేదిక నుంచి జనాన్ని అర ఫర్లాంగు దూరం నెట్టేశారు. వేదిక ఆకాశమంత ఎత్తుంది. మంత్రులను ముందు వరుసలో కూర్చోబెట్టి నటీనటులను వెనక వరుసల్లో కూలేశారు.

అవార్డు నందుకోవడానికి వచ్చిన ఆ ఒక్క ఆ ఒక్క క్షణం ఏ నటీమణి, నటుడు లేదా నటుడు కూడాజనం కంటబడలేదు. ఏకే 47 తుపాకులు పట్టుకొని నిలబడ్డ పోలీసులను చూచి తృప్తి పడవలసి వచ్చింది. ముందు వరుసలో కూర్చున్న కొద్ది మంది తప్ప, 90 శాతం జనానికి వేదికపై వున్నవారెవరూ కన్పడనే లేదు. అవార్డులు స్వీకరించిన తారామణుల చేత ఒకటి రెండు మాటలు మాట్లాడించి వుంటే కొంత బాగుండేది. కాని అదీ చేయలేదు. ఎంత ఉత్సాహంగా, పోలీసుల కసుర్లు విసుర్లు భరించి, మద్రాసు బస్టాండు దగ్గర ట్రాఫిక్ ఆపివేసినా అంతదూరం నడిచి వచ్చారో; అంతే నిరుత్సాహంతో వెనుదిరిగారు జనం. ఈ నంది ఉత్సవం, సింహపురీయులను ఎంత నీరస పరచిందో!

# పత్రికలు వ్యాపారమై పోవడంతో వార్తలు దారుణంగా కలుషితమైనాయి!

జమీన్‌రైతు స్థాపక సంపాదకుడు స్వర్గీయ నెల్లూరు వెంకట్రామానాయుడు జయంతి సభ 3వ తేదీ సాయంత్రం గంభీరంగా జరిగింది. ఉదయం దినపత్రిక ప్రధాన సంపాదకుడు శ్రీ గజ్జెల మల్లారెడ్డి ఈసారి అవార్డు స్వీకరించారు. మల్లారెడ్డి గారికి అవార్డు ఇవ్వడంలో ఒక ప్రత్యేకత వుంది. ఇప్పటి వరకు రామానాయుడు అవార్డు స్వీకరించిన పదహారు మందిలో గ్రామీణ వాతావరణంతో సాన్నిహిత్యం కల్గిన తొలి సంపాదకుడు ఆయనే కావడం ఆ ప్రత్యేకత. ఈ నాటికీ తను మట్టిలో నుంచి వచ్చిన మనిషినేనని ఆయన భావిస్తుంటారు. తన సంపాదకీయాలలో పల్లెపదాలు, గ్రామాలలో వ్యవహారంలో వుండే సామెతలు వాడే

## రామానాయుడు జయంతి సభలో గజ్జెల మల్లారెడ్డి నిర్మొగమాట ప్రసంగం

అలవాటు ఆయన కిప్పటికీ పోలేదు. గ్రామీణుల కోసం, గ్రామీణ భాషలో, గ్రామాలకే పరిమితం చేసి పత్రికను నిర్వహించిన రామానాయుడు గారి స్మృతి అవార్డును మల్లారెడ్డి గారికివ్వటం ఎంత సముచితంగా వుంటుందో వేరే చెప్పనవసరం లేదు.

ఆనాటి సభను జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి అధ్యక్షించారు. జమిందారీ గ్రామాలలో నానా కష్టాలు పడుతుండిన రైతాంగాన్ని తన వ్రాతల ద్వారా ఎంతో ఉత్తేజ పరచి, ఉత్సాహ పరచిన రామానాయుడి గారిని మరువలేమని, జమీన్‌రైతు పత్రికను వారం వారం చదవడం నెల్లూరీయులందరికి క్రమం తప్పని అలవాటని అన్నారాయన.

రామానాయుడి గారితో వ్యక్తిగత పరిచయంతో పాటు, ఆయనతో కలిసి ఉద్యమంలో పాలు పంచుకొన్న స్వాతంత్ర్య సమర యోధుడు శ్రీ రావిపాటి మహానంద మాట్లాడారు. ఎన్నేళ్ళు గడిచినా రైతాంగ సమస్యలు మాత్రం అట్లే వుండడం పట్ల విచారం వ్యక్తం చేశారాయన.

మల్లారెడ్డి ప్రసంగం అద్భుతంగా వుందింది. పత్రికా ప్రపంచం పోకడల గురించి సూటిగా, నిర్మొగమాటంగా, మాటలకు తడుము కోకుండా, సరళంగా ఇంకా మొరటుగా చెప్పాలంటే పచ్చిగా తన అభిప్రాయాలు వ్యక్తం చేశారాయన. "ఈ నాటి పత్రికలలో సంపాదకులకు స్వేచ్ఛ వుందని ఎవరైనా అంటే అది నిఖార్సయిన అసత్యం; పెట్టుబడి పెట్టిన యజమాని ఎట్లా వ్రాయమంటే అట్లా వ్రాయడం తప్పని సరైందిప్పుడు. ఏ పత్రికలో వుంటే ఆ బాణీకి తగినట్లు వ్రాయాలి. యజమానుల రాజకీయాలు పరిమితులు, వ్యాపారాల కనుగుణంగా వ్రాయాల్సిందే తప్ప, ఏ సంపాదకుడైనా తన పైత్యమంతా గుమ్మరిస్తానంటే, శాలువా కప్పి ఇంటికి సాగనంపుతారు" అన్నారాయన. "రామానాయుడు గారి పద్ధతిలో వ్రాయాలంటే అప్పుడు చదివేవాడు లేడు, సత్యాన్ని భరించే వాతావరణమే లేదు. సెన్సేషనలిజం రాజ్యం చేస్తున్నది. కూర కనపడకుండా మసాలా మెత్తినట్టు వార్తలు వ్రాయాలిప్పుడు. వీళ్ళకంటే, వాళ్ళ వరణం కంటే వార్తలు, పత్రికలు కలుషిత మౌతున్నాయి. ఆ కలుషిత వార్తల మధ్య మర్గిపోటీ వుంది. పత్రికా వ్యాపారమే అట్లా తయారైంది. వార్తను ఏ రీతిలో అమ్మితే లాభం వస్తుందన్నదే నేటి పాత్రికేయత్వం" అని చెప్పారు శ్రీ మల్లారెడ్డి. యజమాని ఇచ్చకు లోబడి సంపూర్ణ స్వేచ్ఛననుభవించడం తప్ప సంపాదకులకు గత్యంతరం లేదన్నారాయన.

ప్రాంతీయతా భావాన్ని పదిలంగా పోషిస్తున్న జమీన్‌రైతు కు ఎన్ని పెద్ద పత్రికలూ పోటీ కాబోవని అభిప్రాయ పడ్డారాయన. ప్రాంతీయ భాషలో, ప్రాంతీయ ప్రజలతో, ప్రాంతీయ వాతావరణంతో మమేకం చెందడం వల్లనే నెల్లూరీయుడు అమెరికాలో వున్నా, ఆఫ్రికాలో వున్నా జమీన్‌రైతును చదివి తీరుతున్నాడని, జమీన్‌రైతు అభిప్రాయాలతో ఏకీభవించని కమ్యూనిస్టు మిత్రులు సైతం ఆ పత్రికను క్రమం తప్పక చదవడం తాను చూశానని చెప్పారు. ఎన్ని పత్రికలలో చదివినా, అదే వార్తను జమీన్‌రైతు ఎట్లా వ్రాసింది అని చదివే నెల్లూరీయులుండడమే ఆ పత్రిక గొప్పదనమని ప్రశంసించారు.

సన్మానాలు సైతం సున్నితమైన వ్యాపారంగా మారి పోయిన ఈ రోజుల్లో జమీన్‌రైతు నుంచి అసలైన సన్మానం స్వీకరించడం సంతోషంగా వుందన్నారు. రాజకీయాలలో అవినీతి ప్రబలడం పట్ల ఆవేదన వ్యక్తం చేశారాయన. అవినీతికి ఆలవాలం కాకుండా వున్న వ్యక్తే లేకుండా పోయాడని, ఎమ్మెల్యేకి 30 లక్షలు, ఎంపీకి కోటి రూపాయలు ఖర్చుపెట్టి గెల్చేవారు అవినీతికి పాల్పడకుండా వుండడమెట్లా సాధ్యమని ప్రశ్నించారు శ్రీ మల్లారెడ్డి. కమ్యూనిస్టు నాయకులు కూడా విరాళాలు వసూలు చేస్తున్నారని, కామ్రేడ్ సుందరయ్య పేరు చెప్పి చందాలు దండు తున్నారని ఆవేదన చెందారాయన.

సభను జమీన్‌రైతు మేనేజింగ్ ఎడిటర్ శ్రీ నెల్లూరు శ్రీరామ మూర్తి స్వాగతించారు. మల్లారెడ్డి గారి గేయాలు తనను ఆ రోజుల్లోనె ఉత్తేజ పరిచాయని, ఇప్పటికీ సంపాదకీయ రచనలలో పల్లె పదాలు వాడుతున్న పాత్రికేయుడు ఆయనొక్కడే నని అన్నారు శ్రీరామమూర్తిగారు. సినీ నిర్మాత శ్రీ ఎం.ఎస్.రెడ్డి, తన తండ్రి స్వర్గీయ మల్లెమాల రామస్వామి రెడ్డి స్మృత్యంకంగా ఏర్పాటు చేసిన నిధినుంచి ఇచ్చే నగదు, రామానాయుడు అవార్డులను శ్రీ మల్లారెడ్డికి అందజేశారు. జమీన్‌రైతు సంపాదకుడు నెల్లూరు శైలేంద్ర ప్రసాద్ సన్మాన పత్రం చదివి, వందన సమర్పణ చేశారు. కుమారి పి.కళ్యాణి కమ్మని ప్రార్థన గీతమాల పించింది.

## వరద

(2 పేజీ కొరవ)

ఈ పర్యటనలో ముఖ్య మంత్రి — అల్లూరులో ఆర్‌టిసి బస్ స్టేషన్, నీళ్ల పథకం, టిటిడి కళ్యాణ మండపం; సింగపేట, ఇస్కపల్లిలలో నీళ్లపథకాలు; ఇస్కపల్లి జి.ప్ర. హైస్కూలు భవనం; నెల్లూరు శ్రీ రాజరాజేశ్వరి దేవాలయంలో కళ్యాణమండపం; గుసుపాటి పాళెంలో ప్రభుత్వ ఆస్పత్రులను ప్రారంభించారు.

గూడూరులో అల్ల పథకం, భీములవారి పాళెంలో టూరిజం కాంప్లెక్సు, బుచ్చిలో మలిదేవి డ్రెయిన్ దగ్గర డ్రైనేజ్ పథకం, నెల్లూరు డి.కె. కళాశాలలో మాదాల జానకిరాం తలపెట్టిన హాస్టలు భవనం, జిల్లాకోర్టు భవనాలు, దుగరాజ పట్నంలో బ్రిడ్జి, పెళ్ళకూరులో బ్రిడ్జి, గుసుపాటి పాళెంలో బ్రిడ్జి, తుమ్మూరులో టిటిడి కళ్యాణ మండపం, వింజమూరులో చెక్‌డ్యాం, కప్పుగుంట ఇందిరగలో స్వర్ణముఖిపై కాజ్‌వేలకు శంకుస్థాపనలు చేశారు.

జిల్లా కోర్టు భవనాల సభలో ముఖ్యమంత్రితో పాటు హైకోర్టు సీనియర్ న్యాయమూర్తి శ్రీలక్ష్మణరావు పాల్గొన్నారు. జమీన్‌రైతులో కోర్టు దుస్థితి చదివి, ఈ నూతన నిర్మాణం తలపెట్టానని, 3కోట్లు నిధులు ఇవ్వడంతో తన బాధ్యత తీరిందని, ఇక సత్వర నిర్మాణం చేయించుకొనే బాధ్యత న్యాయవాదులదేనని అన్నారు ముఖ్యమంత్రి. న్యాయశాఖ మంత్రి శ్రీ సమర సింహారెడ్డి త్వరలో ఉదయగిరిలో కోర్టు పెడుతున్నట్లు ప్రకటించారు.

ఈ పర్యటనలో మంత్రులు శ్రీ మాదాల జానకిరాం, శ్రీ నేర్ని కృష్ణమూర్తి, శ్రీ పెంటకోటరాజా తదితరులు పాల్గొన్నారు. ఒక్కరు తప్పిపోకుండా ఎమ్మెల్యే లందరూ హాజరు వేసుకున్నారు.

## జనవాణి

3 పేజి కొరవ

### పబ్లిక్ లేవటరీస్ ఏర్పాటు చేయండి!

నెల్లూరు టౌన్ నాలుగు వైపులా శరవేగంతో విస్తరించి పోతున్నది; టౌన్‌లో వుండే జనాభాతో పాటు, నిత్యం వచ్చి పోయే ఫ్లోటింగ్ జనం కలిసి కిటకిట లాడుతున్నది. కాని ఇంత పెద్ద టౌన్‌లో సులభ కాంప్లెక్స్ దగ్గర తప్ప, మరెక్కడా పబ్లిక్ లేవటరీలు లేవు; కనీసం మూత్రశాలలు లేవు. మగవాళ్లకు అక్కడక్కడా మొక్కుబడిగా యూరినల్స్ అయినా వున్నాయి; ఆడవాళ్ల పరిస్థితే అధ్వాన్నం. పనిమీద నెల్లూరు వచ్చే ఆడవాళ్లు పడే బాధలు వర్ణనాతీతం. కలెక్టర్ గారు, పరిస్థితి అర్థం చేసుకొని, కూడలి ప్రదేశాలలో స్త్రీలకు మూత్రశాలలు నిర్మించ గల్గితే బాగుంటుంది.

—పానుగంటి శ్రీరాములు

చెన్నూరు

## సణుగుడు

4 పేజి కొరవ

ఇంటికి ఎంతటి కళ తెచ్చిందో చూస్తె కాని అర్థం కాదు. ఆరు నెలల క్రితం ఇదే ముఖ్యమంత్రి ఇదే మండపానికి శంకుస్థాపన చేయనొచ్చినపుడు ఇంత చిన్న పనికి అంత పెద్ద మనిషి రావాలా అన్నారు; కట్టినప్పటి కిలే అని పెదవి విరిచారు; ఈ కాస్తంత స్థలంలో ఈ కట్టడం కట్టి దేవాలయాన్ని ఎందుకు పాడు చేస్తారని నిష్ఠూరాలు పల్కారు. ఇప్పుడదే జనం ఆ కట్టడపు కళ చూసి అబ్బా అంటున్నారు.

మల్లారెడ్డిగారెప్పుడో చెప్పారు- తెలుగునాట భక్తిరసం తెప్పలుగా పారుతూంది; డైనేజి లేక దేంజరుగా

కొరవ 6 వ పేజిలో





సైన్స్ ఫేర్‌లో కలెక్టర్ శ్రీ కె. రాజా గారికి మెమెంటో అందజేస్తున్న బాలాజీ విద్యాలయం ఇంగ్లీషు మీడియం స్కూలు కరస్పాండెంట్ శ్రీ డి. విఠల్ రావు చిత్రంలో మాజీమంత్రి శ్రీ ఆనం రామనారాయణ రెడ్డి గారిని చూడవచ్చు

నటీమణుల
నగ్నాంగాల
ప్రదర్శనతో కాసులు
జవురు
కోవాలనుకున్నాడా
రామారావు గారు ?

# సమ్రాట్ అశోక

వెర్రి కేకలు
పిచ్చి చేష్టలు
కారుకూతలతో
ప్రేక్షకుడికి
మతితప్పుతూంది

పురాతన కాలంలో చైనా దేశం చిత్రహింసలకు ప్రసిద్ధిగా వుండేదట. చెవి దగ్గర భరించరాని ధ్వని ప్రకంపనలు సృష్టించి, ఎంతటి వాడినీ లొంగదీసేవారట. వారి వారసత్వంగా తీసుకున్నట్లున్నారు – 'విశ్వవిఖ్యాత చిత్రహింసల సార్వభౌమ' నందమూరి తారకరామారావు గారు! సమ్రాట్ అశోకను వరుసపెట్టి నాలుగాటలు చూపితే; కదలడానికి వీల్లేకుండా హాలులో కూలేస్తే ఎంతటివాడికీ కర్ణభేరులు పగిలిపోయి, మెదడులో నరాలు చిట్లి, స్వరపేటిక తునాతునకలై, కడుపులో ప్రేగులు ఉండచుట్టుకుని పోయి, మనసు శూన్యమై, వికారంగా మారి, ఒళ్లు తెలియని ఉన్మాదంతో పిచ్చి చూపులు చూస్తూ, బొక్కాలు చింపుకుంటూ, జుట్టు పీక్కుంటూ బయటకు పరుగెత్తుక రావడం ఖాయం. ప్రపంచంలో మరే ప్రదేశంలోనూ ఇంతకంటే క్రూరమైన చిత్రహింసల శిక్ష వుండదు; వుండబోదు. రోజుకు నాలుగాటలు చొప్పున మూడు వారాలో, నాలుగు వారాలో ఈ హింసల సామ్రాట్ చిత్రాన్ని ఆడించి తీరవలసిన ప్రొజెక్టర్ ఆపరేటర్ల దయనీయ స్థితికి ఆంధ్రప్రేక్షక లోకం ప్రగాఢ సంతాపం తెలపాలి! సినిమా టికెట్ కొనడంతో పాటు ఆపరేటర్లు ఆ తర్వాత సైకాలజిస్టులకు చెల్లించవలసి వచ్చే ఫీజులకు గాను ప్రతిప్రేక్షకుడూ కొంత చందా ఇవ్వడం సముచితమేమో!

ఇది సినిమానా? అందులోనూ భారతజాతి చరిత్రలో చెరగని స్థానం పొందిన ఒక మహిమాన్విత వ్యక్తి చారిత్రక గాధ చిత్రమా ఇది? కానే కాదు! ఎన్టిరామారావు గారు లోకబారు జానపద చిత్రాల బాణీలో తనకు తానుగా వ్రాసుకొన్న ఒక ఆటవికుడి కథ ఇది. ఆ అశోకుడే ఇప్పుడు బ్రతికి వుంటే, ఇది తన కథ అని తెలుసుకుంటే, లబ్బున గుండె ఆగి చావడం ఖాయం. చరిత్రను ఇంత దారుణంగా ఖూనీ చేయడం ఎన్టిఆర్ ఒక్కరికే చెల్లు.

రాజ్యకాంక్ష, పరత్వంతో, విశ్వవిజేత కావాలనే తమకంతో సమరాన్నివ్యసనంగా స్వీకరించి, ఆ తర్వాత పశ్చాత్తాపంతో శాంతమూర్తిగా మారిన ఒక ధీరోదాత్త చక్రవర్తిని అరణ్యాల్లో పెరిగే కిరాతకుడిగా, ఆటవికుడిగా చూపించారు; అతడి రాజ్యకాంక్షకు తల్లిని అవమానించారన్న సెంటిమెంటును, భారత దేశాన్ని ఏకం చేయాలన్న ఆశయపు రంగును

దోశేంద్ర

పులిమారు. రుద్రదేవుడనే తోక ఒకర్ని తగిలించారు; వీరిద్దరూ కలిసి మనుషుల తలలు తెగనరికి, రాక్షసులవలె వికటాట్టహాసాలు చేస్తుంటారు; తెగిన తలలు చేతిలో పట్టుకొని వికారంగా ప్రదర్శిస్తుంటారు. అశోకుడి శౌర్యప్రదర్శనకు దర్శకుడు కనిపెట్టిన సన్నివేశాలివి. అంత కంటే ప్రతిభావంతంగా ఆలోచించే సామర్థ్యం అతగాడికి ఎక్కడిది!

అశోకుడి సామర్థ్యం ప్రదర్శించడానికి తక్కిన రాజులు, చక్రవర్తులందరినీ వట్టి వాజమ్మల వలె తయారు చేశారు. మౌర్యసామ్రాట్ రాజదర్బారులోకి ఎన్టిఆర్‌గారి అశోకుడు నేరుగా గుర్రం ఎక్కి వెళ్ళిపోతాడు; చక్రవర్తిని పట్టుకొని నానా మాటలంటాడు; అడ్డొచ్చిన సైనికులను ఒక కత్తి విసురుతో భయపెట్టేస్తాడు. ఎంత అసందర్భమైన చిత్రీకరణ ఇది. రాజదర్బారు. అంటే తాను వేసిన సినిమా సెట్టింగ్ అన్న ఆలోచన తప్ప మరేమీ వున్నట్లు లేదు. ఎన్టిఆర్ గారికి! అశోకుడితో సమశౌర్యం కల్గిన కళింగ రాజును పిరికి పందగా, వెన్నుపోటు పొడిచే నీచుడిగా చూపారు.

చాణక్య ప్రహసనం మరొక దుర్భరమైన విషయం. అశోకుడి అమ్మ పిల్చినప్పుడల్లా చాణుక్యుల వారి ఆత్మ అట –తటాలున ప్రత్యక్షమౌతుంటుంది. రాజనీతి శాస్త్రాన్ని క్షుణ్ణంగా చదివి, తన కుటిల రాజనీతి ద్వారా నంద వంశాన్ని నిర్మూలనం చేసిన పండితుడిగానే చాణక్యుడు ప్రపంచానికి తెలుసుకాని, అతడు దెయ్యంగా మారి అప్పుడప్పుడు అక్కడక్కడా ప్రత్యక్షమౌతుంటాడని ఎన్టిఆర్ ఒక్కరే కనిపెట్టినట్లున్నారు. ఎప్పటి చాణక్యుడు? ఎప్పటి అశోకుడు? బోడిగుండుకు, మోకాలికి ముడిపెట్టె

తరువాయి 10 పేజీలో

# విజయశాంతి హిందీ చిత్రం భలే వుందట!

విజయశాంతి నటించిన "తేజస్విని" హిందీ చిత్రం "కర్తవ్యం" కన్నా ఎంతో అద్భుతంగా తయారైందని ఉత్తరభారతంలో చాలా మంది అభిప్రాయపడ్డారు. ఆమెతో పాటు అమ్రీష్‌పురి, దీపక్ మల్‌హోత్రా, చరణ్‌రాజ్, కులభూషణ్ కర్బందా, టినూ ఆనంద్, ఊర్వశి, బాబూమోహన్, వంకాయల ఆదిగా గలవారు పాల్గొన్నారు. మాటలు. కమలేష్ పాండే, సంగీతం: . లక్ష్మీకాంత్ ప్యారేలాల్, ఛాయ: పి.ఎస్. ప్రకాష్, నిర్మాత: ఎ. ఎం. రత్నం, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: ఎన్. చంద్ర.

హిందీ చిత్రాలలో నటిస్తున్నందు వల్లనేమో విజయశాంతి ఇటీవల ప్రతి మాటకూ "అచ్ఛా!" అంటోంది. ఈమె హోమ్ మినిస్టర్‌గా నటించే "ఆశయం" చిత్రం మూడొంతులకు పైగా పూర్తయింది. ఈమెతో పాటు ఈ చిత్రంలో జగపతిబాబు, చరణ్‌రాజ్, సాధన, విజయకుమార్, నర్రా, సత్యారెడ్డి,

## 'ఆశయం' పూర్తికానుంది

అమ్మతారెడ్డి, పరుచూరి వెంకటేశ్వర రావు పాల్గొంటున్నారు. రచన. పరుచూరి సోదరులు, సంగీతం. రాజ్–కోటి, ఛాయ డి. ప్రసాద్‌బాబు, నిర్మాత. ఎ.ఎం. రత్నం. దర్శకత్వం. ఎ. మోహన్‌గాంధీ.

# జయమాలినికి పెళ్ళి సమస్య జ్యోతి లక్ష్మికి కూతురి సమస్య!

జయమాలిని మూడవ పడిలో అడుగెట్టినప్పుడు కాస్త స్థూల కాయురాలైంది. దానితో ఆమెకు బుక్కింగ్‌లు తగ్గసాగాయి. ఇక పెళ్ళి చేద్దామనుకున్నారు ఆమె తల్లిదండ్రులు. ఎంత ప్రయత్నించినా సరైన సంబంధాలు దొరకలేదు. వరుడు లక్షణంగా ఉంటే ఆస్తిపాస్తులు ఉండడంలేదు; స్థితిమంతుడైతే, సర్వవాలిటీ ఉండడం లేదు. ఇక జయమాలిని విసుగెత్తి, తిండి తగ్గించి, దేహ పరిశ్రమ చేయడం మొదలెట్టింది. అనుకోకుండా ఒక తమిళ చిత్రంలో బుక్ అయింది. ఎ.వి.యం. స్టూడియోలో ఈ చిత్రం షూటింగ్ కు ఆమెకు తోడుగా ఆమె తల్లి కూడా వెళ్ళింది. పక్క ఫ్లోర్‌లో మరో తమిళ చిత్రం షూటింగ్ జరుగుతూంటే, అక్కడ కెళ్ళిందా తల్లి. సెట్‌లో ఉన్న శివాజీగణేశన్ ఆమెను చూడగానే "ఎన్నాకెన్నాళ్ళకు అమ్మాయి బాగుందా?" అని అడిగాడు.

"తగిన సంబంధాలు రావడం లేదండి. అమ్మాయికి ఇంట్లో బోర్ కొట్టి పోయింది. అయిష్టంగానే ఒక సినిమా ఒప్పుకుంది. పక్కఫ్లోర్‌లో ఇప్పుడు షూటింగ్ జరుగుతోంది. ఆ డ్రెస్‌లో మిమ్మల్ని చూడ్డానికి సిగ్గు పడుతోంది. అందుకే నన్ను పంపింది."

ఆమె మామూలుగా నటించేది అలాంటి డ్రెస్‌లోనే కదా! కొత్తగా సిగ్గెందుకు? అని శివాజీ గణేశన్ జోక్

మద్రాసు సినిమా వార్తలు

చేశారు. జయమాలిని త్వరలో పెళ్లి కావాలని ఆమె తల్లిదండ్రులు ఎందరో దేవుళ్ళకు మొక్కుకున్నారు. ఎప్పుడు ఏ దేవుడు కటాక్షిస్తాడో ! మరి !

మరో వర్తకి సిల్క్‌స్మిత ఆమె ప్రియుడు డాక్టర్ రాధాకృష్ణను ఈ సంవత్సరాంతంలోగా వివాహం చేసుకుంటుందట.

జ్యోతిలక్ష్మి తన కూతుర్ని సినిమా తార చేయడానికి ప్రయత్నాలు, ఫైట్లు ...చేస్తోంది. "మా అమ్మాయి చక్కని హీరోయిన్ అవుతుంది. ముందు తమిళ చిత్రాలలో నటిస్తుంది. ఇతర భాషా చిత్రాలలో పేరు తెచ్చుకున్నాకే కదా తెలుగువారు గుర్తించేది?" అంది జ్యోతిలక్ష్మి నవ్వుతూ.

## ముత్యాలసుబ్బయ్య "ఇల్లు–పెళ్ళి"

"ఓ ఇల్లు కట్టాలనుకుంటాడు హీరో. ఓ ఇంటి దాన్ని కావాలనుకుంటుంది హీరోయిన్. ఇల్లు కట్టి పెళ్ళి చేసుకున్న తర్వాత ఈ జంట ఎదుర్కొనే సమస్యలే ఈ చిత్రకథ" అన్నారు నెల్లూరీయుడు ముత్యాల సుబ్బయ్య ఈయన దర్శకత్వంలో పి. రామచంద్రారెడ్డి తిరుపతి ప్రాంతంలో నిర్మిస్తున్న "ఇల్లు–పెళ్ళి" చిత్రం నరేష్, రోజా, గొల్లపూడి మారుతీరావు, చె. అల్లు రామలింగయ్య, బ్రహ్మానందం, అనూరాధ, జయశీల వగైరా తారాసందోహం నటిస్తున్నది. కథ : గొల్లపూడి, మాటలు: తోటపల్లి మధు, పాటలు : సీతారామశాస్త్రి, వెన్నెలకంటి, జాలాది. సంగీతం: చక్రవర్తి.

## జూన్‌లో "పెద్దరికం"

బుచ్చి వాస్తవ్యుడు ఎ.ఎం.రత్నం స్వీయ దర్శకత్వంలో నిర్మించిన "పెద్దరికం" చిత్రం రషెస్ చూసిన వారు చాలా బాగా రూపొందిందని అభినందిస్తున్నారు. డాక్టర్ భానుమతి రామకృష్ణ, పిల్లి, జగపతిబాబు, సుధాకర్, బాలయ్య, చలపతిరావు, నర్రా, ఉదయ్‌ప్రకాష్, నవీన్, కవిత, సాధన, తాతినేని రాజేశ్వరి నటించారు. మాటలు :

తరువాయి 10 పేజీలో

## నెల్లూరు అ.జిల్లా కోర్టులో

OP 552/91

కె.వి.యస్. నారాయణ రాజు పిటీషనరు

Vs

కగ్గా మల్లికార్జున రావు
ATN 9779 ఓనరు
బి. కృష్ణయ్య (లారీడైవరు) Etc
-Respondents

పై నెంబరు లారీ ఆక్సిడెంటు కేసులో మీలో 1,2 వారలు నోటీసు అందు కొనందున జమీన్‌రైతు పేపరు ద్వారా నోటీసు జారీ చేసినారు. వాయిదా 24.6.92 సదరు తేదీన ఖద్దునగాని ప్లీడరు ద్వారా గాని ఆక్షేపణలు తెలుపుకోవలెను లేని యెడల మీ పరోక్షమున పరిహరింపబడును.

పి.వి. రాజు
పిటీషనరు తరపు న్యాయవాది, ఏలూరు

## గూడూరు డి.ము.కోర్టులో

O.S. 43/91

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, పొదలకూరు,
Rep. by. బ్రాంచి మేనేజరు- వారికి

Vs

కంచి బాలక్రిష్ణయ్య మరియొకరు
- ప్రతివాదులు

### నోటీసు

To
కంచి బాలక్రిష్ణయ్య S/o. వెంకట సుబ్బయ్య, పెనుబర్తిగ్రామం,రాపూరు (మండలం)నెల్లూరు (జిల్లా)

వారి పై నెంబరు దావా బాకీ రాబట్టు నిమిత్తం పై కోర్టులో మీ మీద దావా దాఖలు చేసి యున్నందున మీరు 16.6.92 తేదీన హాజరై మీకు గల ఆక్షేపణలు తెల్పుకొని యెడల మీ పరోక్షమున దావా తీర్మానించబడును.

వాయిదా: 16.6.92

సి. పరాంకుశ రావు
వాది తరపు న్యాయవాది.

## నెల్లూరు 1 వ డి. ము, కోర్టులో

EP NO. 84/91 - OS 218/87

పరిటాల రాఘవయ్య డి.హోల్డర్

Vs

సయ్యద్ జాఫర్‌పురహబాబు JDR

జె.డి.ఆర్. తాలూకు షెడ్యూలు దాఖలా ఆస్తి 22.6.92 తేది ఉదయం 10.30 గంటలకు కోర్టు వద్ద వేలం వేయబడును. కొనుగోలు చేయదలచిన వారు పాటలో పాల్గొనవచ్చును.

### షెడ్యూలు

నెల్లూరు టౌన్, వేదాయపాళెం, మునిసిపాలిటీలో చేరిన మహాత్మాగాంధీ నగర్‌లో, మెట్ట SNo. 5 No. II - 'A' Block లేఅవుటు ప్లాటు 123 డోరు నెం. లేని 15 అంకణముల కాలీ స్థలం. అందులో 5 అంకణములు అమీనా ప్రకారం 3 - అంకణములు మిద్దెకు హద్దులు: తూ: సుల్తాన్ మొహిద్దీను ఇల్లు; ద. ప:రోడ్డు;ప: షేకు రఫీద్‌సాహెబు యిల్లు.

డి.హో. క్రయం రూ. 20,000
అమీనా క్రయం రూ. 25,000

చింతా శ్రీరామమూర్తి
అడ్వొకేటు

## వేదాల నుంచి మన దాకా ఎందరో కవులను ఊరించిన 'ఊర్వశి' పై మంచి పుస్తకం

"ఊర్వశి" అనే పేరుగల ఈ వచన గ్రంథ రచయిత శ్రీ పచ్చిపులుసు వెంకటేశ్వర్లు, ప్రస్తుతం వెంకటగిరి ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో ఆంగ్లోప న్యాసకులుగా పనిచేస్తున్నారు. సరస హృదయులు. బహు గ్రంథకర్తలు. వేదాల మొదలు ఆధునిక కావ్యాల వరకు ఊర్వశిని వర్ణించిన కవి మహోద్ధండుల భావనా రీతుల్ని సరళ సుందర వచన శైలిలో కూలంకషంగా అనుశీలించారు. ఊర్వశి పుట్టుపూర్వోత్తరాలకోసం ఎన్నో గ్రంధాలు తిరగేసారు. ఊర్వశిని గూర్చిన వివిధ అనుభూతులు ఈ గ్రంథంలో చక్కగా చోటుచేసుకొన్నాయి. పురాణ ప్రసిద్ధమైన ఊర్వశిని ఆధారం చేసుకొని రవీంద్రుడామెను ప్రకృతిగా భావించి మాట్లాడారు తన కవితలో! వే కాలంనుండి విన వస్తున్న ఈ దేవకన్య పురాణాలలో పుట్టెడు కథలతో ప్రచారమైంది. ఆమె నారాయణుని ఊరువునుండి పుట్టిందని గాథ. కాబట్టే ఊరువశియైనది. నారాయణుడు శృంగార రసాధి దేవత. దాని గమనానికి ఆధారం ఊరువు. ఊర్వశి స్త్రీ స్పర్శలేకుండా పురుష శరీరం నుండి పుట్టింది.పురుష సృష్టి సంకల్ప ప్రధానం. నారాయణుడు తన సంకల్పానికి ఒక ఆకారం కల్గించడానికి తన ఒడలికండలనే వినియోగించాడు. అంటే పురుష సంకల్పంలో నుండి సృజన శక్తిగా అంకురించి శృంగార చైతన్యానికి ప్రతీకగా విర్బిన సౌందర్యాధి వ్యక్తి ఊర్వశి. సౌందర్య స్పృహకు సహజ ప్రతీక ఆమె. కాబట్టి రవీంద్రుడు ఆమెను మాతకాదు, కన్య గాదు, వధువూ కాదన్నాడు ఆమె వ్యక్తిలో సౌందర్య అనుభవేచ్ఛగా అంకురించిన అబల. అట్టి రసాధి దేవతను వెంకటేశ్వర్లు గారు ఋగ్వేద, శతపథ బ్రాహ్మణ,

**గ్రంథసమీక్ష**

రచయిత: పచ్చిపులుసు వెంకటేశ్వర్లు
120 పేజీలు: వెల రూ. 35 లు

**ప్రతులకు**
ఆం.ప్ర.బుక్ డిస్ట్రిబ్యూటర్స్
ఏలూరు రోడ్డు
విజయవాడ - 2

సమీక్షకుడు: డాక్టర్ ఉడాలి నరసింహశాస్త్రి
ఎం.ఎ., పి.హెచ్.డి.

మత్స్యవిష్ణుస్కాంద పురాణాలలో, దేవీ భాగవతంలో పరిశీలించి ప్రకృతి పరమాత్మల అనుబంధం ఎలాంటిదో రుచి చూపారు. అందాల అతివగా అభివర్ణించిన అరవిందుని ఊర్వశిని గూర్చి చెబుతూ దేవమానవ సమాగమం మానవునకు అమృతత్వ సిద్ధిని కల్గజేస్తుందన్నాడు. రవీంద్రుని భావనాసుమాల నుండి వెల్లి విరిసిన

## ఊర్వశి

ఊర్వశిని విశ్లేషిస్తూ జీవితంలో సుఖదుఃఖాలకు ఊర్వశి చెబట్టిన అమృత విషభాండాలు ప్రతీకలన్నారు. దినకర్ ఊర్వశి విరాగి మనస్సులో రాగాన్ని మేల్కొల్పే జాణగా అభివర్ణించారు. ఇక కృష్ణ శాస్త్రి గారి ఊర్వశి తన మధుర కవితా రసాయనంలో ఓలలాడింది. భగవంతుని పురుష ప్రవృత్తి, భక్తుని స్త్రీ ప్రవృత్తి శాస్త్రి గారి విశ్లేషణలో ద్యోతకం చేశారు.

చలంగారి ఊర్వశి సంఘ నియమాలకు, మూఢాచారాలకు విరుద్ధంగా ఊపిరి పోసుకొంది. అహంకార నిర్మూలన సర్వసంగ పరిత్యాగం జరిగితే గాని అసలైన నిస లైన ప్రేమ అర్థంగాదన్నారు.

ఇలా పచ్చి పులుసు వారు వేదాల మొదలు అధునిక కావ్యాల వరకు ఊర్వశి స్వరూప స్వభావాలను పరిశోధనా దృష్టితో అనుశీలన చేసారు. విజ్ఞానం వివిధ రీతులలో విస్తరిల్లుతున్న ఈ రోజులలో ఇట్టి కావ్యానుశీలత ఎంతేని అవసరం. సిద్ధాంత గ్రంధానికి ఉండవలసిన గురుత్వం దీనికి ఉంది. ఇన్ని గ్రంధాలలో ఏమున్నదో తెలుసు కొనే ఓపిక , తీరిక, కోరిక వెంకటేశ్వర్లు గారికి ఉండడం హర్షణీయం. ఈ గ్రంథం వీరి నిరంతర కృషికి , సునిశిత పరిశీలనకు ప్రతిభాపాండిత్యాలకు [illegible]

అనంగకు ఎన్నాళ్ళగానో తెలిసిన హరిజన వనిత మోతి పెట్టిదన్నంకోసం అనంగ యింటికి వస్తుంది. ఆమె అన్నం తెచ్చేలోగానే ఆకులు వీడింది. ఈ పరిస్థితుల్లో తాను గర్భవతినని భర్తతో చెప్తుంది అనంగ!

ఇది టూకీగా టాకీ కథ.

సత్యజిత్ రాయ్ చిత్రాలకు ఒక ప్రత్యేకత ఉంది. ఒక స్థాయి ఉంది. ఆ స్థాయిలోనే ఉంది ఈ చిత్రం.

ఎనిమిది ఫెస్టివల్స్‌లోనూ అవా ర్డులను సంపాదించుకుంది చిత్రం.

సత్యజిత్‌రాయ్ తీసుకునే కథావస్తువులనూ అతని ట్రీట్ మెంట్‌లనూ నేను సమర్థించలేనుగాని, అతనిలోని ఆర్టిస్టిక్ టచ్‌ని అభినందించక తప్పదు.

[18- 10- 74 పత్రిక నుంచి]

## సింహపురి

(4 పేజీ కొరవ)

ప్రక్రియలో పిల్లలు ఎందుకూ కొరగాని దద్దమ్మల మాదిరి తయారౌతున్నారు. సగం ప్రైవేటు స్కూళ్ళలో అసలు బడి వాతావరణమే వుండదు. బస్సులో ప్యాసింజర్లను టిక్కెట్ల సినిమాలో లెక్కేసినట్లు , క్లాసులో పిల్లల్ని ఫీజుల రూపంలో ఎంచుకోవడం తప్ప. ఈ స్కూళ్ళకు వేరే వ్యాపకమే లేదు.

మునిసిపల్ స్కూళ్లు మూంత మోయడమే ఈ పరిస్థితికి కారణం. వీటికి మంచి భవనాలుంటాయి ; క్వాలిఫైడ్ టీచర్లుంటారు; చదువుకు ఒక పద్ధతి వుంటుంది; చూడడానికి పై అధికారులుంటారు; ఇన్స్పెక్షన్లుంటాయి; అయినా ఇవి ప్రైవేట్ స్కూళ్ళతో పోటీ పడలేక పోతున్నాయంటే, పిల్లల్ని ఆకర్షించ లేక పోతున్నాయంటే కారణమేమిటి? మునిసిపల్ నేతల చేత కాని తనం తప్ప మరొకటి కాదు. టీచర్ పోస్టులు అమ్ముకొనడానికి చూపే శ్రద్ధలో పాతిక వంతు ఆ టీచర్లు ఎట్లా పనిచేస్తున్నారు, స్కూళ్లు ఎట్లా నడుస్తున్నాయి అని పట్టించుకొనే పురపాలక నేతలు వున్నారా మనకి? గత పది పదిహేనేళ్లలో ఏ ఒక్కసారైనా ఏ ఒక్క ఛైర్మనైనా తమ పరిధిలోని స్కూళ్ళను సందర్శించినట్లు , సమస్యలు సమీక్షించినట్లు విన్నామా మనం? ఎవరో విజిటి వచ్చినపుడు ప్రారంభోత్సవాది కార్యక్రమాలు పెట్టడానికి తప్ప, పాఠశాలలు గుర్తుకె రావు. ఇక అవెట్లానడుస్తాయి? ఎవరు చేరుతారు? ప్రైవేటు స్కూళ్ల మూడు స్పెషల్ ఫీజులు, ఆరు బిల్డింగ్ డొనేషన్లుగా విలసిల్లక ఏమిచేస్తాయి?

కలెక్టర్ గారికి విద్యా విషయకంగా పరిపూర్ణమైన అవగాహన వుంది. అక్షరాస్యత , పొస్టర్సులో ల్యూషన్ను వంటి కార్యక్రమాల ద్వారా పాఠశాలలను చాలా లోతుగానే అధ్యయనం చేశారు అయనైనా , తన స్పెషల్ అఫీసరు పాలనా కాలంలో మునిసిపల్ స్కూళ్లను చక్క దిద్దగల్గితే , అవి గతిలేని వారికే పరిమితమన్న అపోహ పోగట్ట కల్గితే బాగుంటుంది

### ముదసలి నేత్రదానం

నెల్లూరు టౌన్ బాలాజీ నగర్‌కు చెందిన ఎం. దుర్గాంబ (75) అతి ముదుసలి అంతిమ క్షణాలలో వెలిబుచ్చిన కోరిక మేరకు రెండుకళ్లనూ నేత్రదాతల సంస్థ సేకరించింది. తన కళ్లను దానం చేయాలని ఆమె ఇంట్లోని వారితో చెప్తుండేరట; ఆ ప్రకారం ఆమె 14 తేది రాత్రి కన్ను మూయగానే ఆమె కుమార్తె కె. నాగమణి నేత్ర దాతల సంస్థకు తెలిపింది; డాక్టర్ ప్రకర్ రెడ్డి, శ్రీ తిక్కవరపు సుకుమార రెడ్డి ఆమె రెండు కళ్లనూ సేకరించి, మద్రాసుకు పంపారు. నెల్లూరు నేత్రదాతల సంస్థ సేకరించిన 10 వ నేత్రాలివి.

### సింగపూరు ఆటలకు నెల్లూరు క్రీడాకారులు

ఆసియా వెటరన్ అథ్లెటిక్ పోటీలకు నెల్లూరు నుంచి ఏడుగురు క్రీడాకారులు వెళ్లారు – డాక్టర్ శ్రీధర్ రావు, శ్రీ డి. బసవయ్య, పద్మనాభం, సయ్యద్ హుస్సేన్, గోవిందరాజులు, ఎన్. మోహన రెడ్డి, కరీముల్లా ఈ బృందంలో వున్నారు.

ఈ సందర్భంలో డాక్టర్ శ్రీధర రావు మిత్రులకు, పత్రికల వారికి కమ్మటి తడివిందుచేసి; యువతుల నృత్య వినోదంతో ఖుషీ చేశారు.

## చిత్రసమీక్ష

(9 పేజీ కొరవ)

ఇటువంటి అపభ్రంశపు సన్నివేశాలు చిత్రంలో కొకొల్లలు. మనపై మనకి జాలి కల్గించే విషయమేమిటంటే – అశోకుడికి అతడి తల్లి ఆకుపచ్చ ప్లాస్టిక్ పలక మీద ఓనమాలు దిద్దుతుంది; అశోకుడి రాజ్యంలో ప్రజల అరిసిన శ్లాబ్ పోసిన ఇళ్లలో కాపురం వుంటారు.

చరిత్ర సంగతి, చవకబారు చిత్రీకరణల సంగతటుంచితే – సామ్రాట్ అశోక్‌లో మరీ వెగటు కల్గించే విషయం – వాణీ విశ్వనాథ్ అంగాంగ ప్రదర్శనం. తన నటనా ప్రతిభపైన, దర్శకత్వ నిపుణత పైన, అఖరకు తనపైనే తాను విశ్వాసం కోల్పోయిన మానసిక దౌర్బల్యంతో రామారావు గారు ఈ చిత్రాన్ని బూతుల బుంగగా మార్చారు. సినిమాలో సగభాగం ఆ నటీమణికి నడుం పైన గుడ్డపీలిక వుండదు ; కొన్ని సీన్లలో నడుం క్రింద కూడా లేదు. నగ్నభుజాలు, జఘనాలు, వక్షోజాలు, నెలక్లాసు ప్రేక్షకుడి నరాలను పురిపెట్టేవలువలు లేని వంటి వంపులు ప్రదర్శిస్తూ, చౌకబారు మలయాళం సినిమాలకంటె నీచంగా నటించింది వాణీవిశ్వనాథ్. ఆ నగ్నాంగాల పొంగులు చూసి ఈ పర్బ్బడిన ముసలి పీనుగకు రిమ్మతెగులు సోకిందేమో ఆమెను పిసికి పారేశాడు. ఆయన చేతులు ఆమె నడుముకు పైన, క్రింద ఎత్తు పల్లాలలో ప్రాకుతుంటే హాలులో కూర్చున్న వారికి వంటిపై తేళ్లు, జెర్రులు ప్రాకు తున్నట్లుండింది. 300 సినిమాలలో నటించి, చలన చిత్ర పరిశ్రమలో అపార గౌరవాభిమానాలు సంపాదించుకున్న ఒక మహానటుడిగా కాకున్నా – ఏడేళ్ల పాటు ప్రజలకు నాయకుడిగా వెలిగినందుకైనా ఆయన సభ్యతా సంస్కారాలు పాటించక పోవడం; రికార్డు డ్యాన్సర్ల కంటె హీనంగా ఆడదాని అంగాలు ప్రదర్శింపజేసి సొమ్ముచేసుకో జూడడం ఘోరం. డెబ్బయ్ ఏళ్ల వయసులో ఈ పాడు బుద్ధి పుట్టినందుకు ఆయనకు సిగ్గెట్లా వేయడం లేదో మరి !

## అశని సంకేత్

(4 పేజీ కొరవ)

వ్యభిచరిస్తుంది! తినటానికి కందమూలాదుల కోసం అడవికి వెళ్ళిన అనంగను ఎవరో బలాత్కరిస్తారు.

## సినిమా

పేజీ కొరవ

పరుచూరి సోదరులు, సంగీతం: రాజ్–కోటి, ఛాయ: ఎస్. గోపాలరెడ్డి, నిర్వహణ: అళహరి రఘురామ్. జూన్‌లో విడుదల.

### మద్రాసులో సినీ సిటీ

చలన చిత్ర నిర్మాణంలోని అన్ని విభాగాలలోనూ సకల ప్రాథమిక సదుపాయాలుగా ఉండే 'సినీ సిటీ' కి మద్రాసు సమీపాన మే 28 న తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత శంకుస్థాపన చేశారు. అతి తక్కువ ధరలో ఇన్‌డోర్, ఔట్‌డోర్ షూటింగ్‌ల సదుపాయాల వల్ల నిర్మాతలకునిర్మాణ వ్యయం బాగా ఆదా చేసే ఈ 'సినీ సిటీ' తయారయ్యాక తెలుగు, కన్నడ నిర్మాతలను సైతం ఆకర్షించగలదని విజ్ఞుల అభిప్రాయం. రాష్ట్రంలో లభించే రాయితీల కన్నా ఈ 'సినీ సిటీ' లోనే బాగా పొదుపు లభిస్తుందని తెలితే, ఇక్కడే చిత్ర నిర్మాణం సాగించవచ్చని కొందరు నిర్మాతలు అనుకుంటున్నారు.

### విజయా చిత్రానికి సింగీతం దర్శకత్వం

"పాపుకారు, పాతాళభైరవి, పెళ్ళిచేసి చూడు, గుండమ్మ కథ" వంటి మరపురాని చిత్రాలను అందించిన విజయా ప్రొడక్షన్స్ వారు చాలా కాలం తర్వాత మరో మణిపూసను అందించ బోతుంది. రాజేంద్రప్రసాద్ హీరో. సింగీతం శ్రీనివాస రావు దర్శకుడు.

### సూళ్ళూరుపేటలో "పెద్దరికం"

ఎ.ఎం.రత్నం స్వీయ దర్శకత్వంలో నిర్మిస్తున్న "పెద్దరికం" చిత్రానికి కొన్ని ఫైట్లు మే 21 న సూళ్లూరుపేట బజారులో చిత్రీకరించారు. ఒకరి ఒంటి మీద మరొకరి చేతులు పడకుండా నటులు ఫైట్ చేసుకోడం చూసిన ప్రజలు, "ఓస్...ఇంతేనా?" అని నవ్వుకున్నారట. థ్రిల్ కలిగించే అలాంటి సన్నివేశాలను మరి అంత బహిరంగంగా చిత్రీకరిస్తే ఎలా? ఇలాంటి షూటింగ్‌లు బజారున పడకూడదు.


**జమీన్‌రైతు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ. 75.00 |
| ఆరు నెలలకు | రూ. 40.00 |
| విడి ప్రతి | రూ. 1.50 |



పెళ్లాం ... వ్యాపారి కె. వెంకటరావు కుమారుడు రాజామోహన్; ... శాసనసభ్యుడు కె. సుందరరామయ్య కుమార్తె సత్యవతి (వీరి వివాహం మే 7 తేది హైదరాబాదులో జరిగింది.)





విద్యుత్ కాంతులు విరజిమ్ముతూ శోభాయమానంగా వున్న సికిందరాబాదులోని లీస్రైలిప్ – రాయల్ ప్రాసాదం. ప్రక్కన సౌరభాలు విరజిమ్ముతూ కళ్యాణమండపానికి దారి తీస్తున్న పూసరాల సౌరంగమార్గం.

## పినాకినీ తీరం

2 పేజీ కొరవ

డాక్టర్ శివాజీ గారి వివరణ ధోరణి. డాక్టర్ శివాజీ వివరణను గూర్చి ఈనాడు పత్రికలో వచ్చిన భాగాన్ని యధాతథంగా దిగువ యిస్తున్నాను.

"సంఘటన తీవ్రత, ముఖ్యమంత్రి మానసిక స్థితిని బట్టి సి.యం. తన బుగ్గలు పట్టుకున్న తీరును చూచిన వారు తనను కొట్టినట్లే భావిస్తారు. హిందూ విలేఖరి ఆ విధంగా వ్రాయడంలో తప్పులేదు. ఆ స్థానంలో ఎవరున్నా ఆ విధంగానే అనుకుంటారు. వాస్తవం ముఖ్యమంత్రికి, నాకు మాత్రమే తెలుసు. నన్ను కొట్టి వుంటే హెలికాప్టర్ కదిలి వుండేది కాదు. హిందూ పత్రికలో చూచిన నా నాయకుడు రామారావు ఆ విధంగా మాట్లాడడంలో తప్పులేదు. తన బిడ్డను ఎవరైనా కొట్టారని తెలియగానే స్పందించిన విధంగా రామారావు గారు స్పందించారు...."

"ఇదే వృత్తాంతాన్ని ఆంధ్రజ్యోతి" సి.యం. నన్ను కొట్టలేదు అనే స్పష్టమైన శీర్షికతో ప్రకటించింది. ఏ పత్రికలో వచ్చినా సారాంశం ఒక్కటే. డాక్టర్ శివాజీని ముఖ్యమంత్రి కొట్టలేదనేది స్పష్టం. శివాజీ గారు తన్ను కొట్టలేదంటారు; హిందూ ప్రకటించడం తప్పు కాదంటారు; రామారావు తిట్టడంలో తప్పు లేదంటారు; ఇక తప్పెవరిది? శివాజీ గారిదేనా?

ముఖ్యమంత్రి తనను కొట్టలేదన్నప్పుడు, కొట్టివుంటే హెలికాప్టరే కదిలి వుండేది కాదన్నప్పుడు ఆ మాటను నిర్మొగమాటంగా నిర్ద్వంద్వంగా ప్రకటించే ధైర్యం ఆయనకు ఎందుకు లేకుండా పోయింది? హిందూ విలేఖరి స్థానంలో ఎవరున్నా ఆ విధంగానే అనుకుంటారంటారు. అనుకోవడానికి మామూలు మనిషికి పత్రికా విలేఖరికి ఎంతో తేడా వుంది. పత్రికా విలేఖరి ప్రత్యేకించి హిందూ విలేఖరి, చూచింది ధృవపర్చుకోకుండా ప్రకటించరు; ప్రకటించకూడదు. అటువంటప్పుడు హిందూ విలేఖరి వ్రాయడం తప్పులేదు అని సమర్థించడం ఏమిటి? పత్రికా వార్తను చదివి తమ నాయకుడు అలా తిట్టడం తప్పులేదంటారు. ఆ నాయకుడు మామూలు నాయకుడు కాదు. ఒక మాజీ ముఖ్యమంత్రి; ఒక బలమైన ప్రాంతీయ పార్టీ అధిపతి; నేషనల్ ఫ్రంట్ అధ్యక్షుడు. అంత బాధ్యత గల నాయకుడు పత్రిక వార్త ఆధారంగా అంత నీచంగా ప్రేలడం సమంజసమౌతుందా? సమర్థనీయమౌతుందా?

శివాజీకి ఎవర్ని నొప్పించడం యిష్టంలేదు. ముఖ్యమంత్రిని దూరం చేసుకోలేదు; పత్రికా విలేఖర్లకు అసంతృప్తి కలిగించకూడదు; తమ అధినాయకుని ప్రవర్తనను సమర్థించాలి. ఆయన ప్రకటనను విశ్లేషిస్తే తేలే అంశాలివి.

నిజాన్ని నిర్భయంగా ప్రకటించలేని డాక్టర్ శివాజీ సంకట స్థితిని చూచినపుడు సానుభూతి కలుగుతుంది!

### నిర్ణేతలు ప్రజలే!

పత్రికలలో వచ్చే వార్తల్లో దేన్ని నమ్మాలి, ఎంత వరకు నమ్మాలి అనేది పాఠకులకు సందిగ్ధమై పోయింది. తెలుగు దినపత్రికలు సరే పోటాపోటీలతో జనాకర్షణ కోసం తమ స్థాయిని రోజురోజుకు దిగజార్చేసుకుంటున్నాయి. అన్ని పత్రికలనూ ఒకే గాట కట్టడం నా అభిప్రాయం కాదు. కాని హిందూ వంటి ఆంగ్ల జాతీయ దినపత్రిక, ఉన్నత స్థాయికి, ప్రమాణాలకు, వార్తాసాధికారితకు విశ్వసనీయమైందిగా ప్రసిద్ధిగన్న హిందూ పత్రిక కూడా తెలుగు పత్రికల కంటే మరింతగా హీనస్థాయికి పడిపోవడం విచారం కల్గిస్తున్నది. అన్ని పత్రికలవలె విస్తరణ కోసం అది తన స్థాయిని తగలేసుకుంటున్నది. ఆంగ్లదిన పత్రికలలో హిందూనే ఎందుకు చదవాలి అనే మీమాంసను పాఠకులలో కల్గించుకుంటున్నది.

నెల్లూరు జిల్లాలో ముఖ్యమంత్రిగా జనార్ధనరెడ్డి చేసిన వాగ్దానాలు, వేసిన పునాదిరాళ్ళు, నెరవేర్చిన కార్యక్రమాలను గూర్చి కలెక్టర్ అధ్యక్షతన జిల్లా అధికారవర్గం ఒక సమీక్షా సమావేశం జరిపిందట. ఆయన వాగ్దానాలు, శంకుస్థాపన పథకాలవిలువ పదికోట్లని, అందులో కోటి రూపాయల పనులు పూర్తి అయ్యాయని ఆ సమావేశంలో తేలింది. తక్కిన కార్యక్రమాల అమలు వివిధ దశల్లో వుంది. ఆ సమావేశపు వార్తకు వివిధ దినపత్రికలు యిచ్చిన శీర్షికలను ఒకసారి వీక్షించండి. –

"Only Foundation Stones and unfulfilled promises" - HINDU

"వాగ్దానాలు నెరవేరుస్తున్న ముఖ్యమంత్రి" - ఆంధ్రజ్యోతి

"నెల్లూరుకు నేదురుమల్లి హామీల ఖరీదు 104 కోట్లు" - ఉదయం.

"సియం హామీలలో పది శాతమే పూర్తి" - ఈనాడు

ఇంకా కొన్ని పత్రికలున్నాయి. ఆ పత్రికలిచ్చిన శీర్షికలన్నింటినీ ఇక్కడ ఉదహరించ అవసరం లేదు. మన దినపత్రికలు ఒకే వార్తను ఏ విధంగా ప్రకటించి పాఠకులను తికమక పెడుతున్నాయో తెలుపడానికి వీటిని వుదహరించాను గాని, విమర్శించడానికి కాదు. జనార్ధన రెడ్డి నిధులు మంజూరు చేయకుండా శంకుస్థాపనలు చేయడం లేదు. చేయుటకు అవకాశం లేని పనులకు వాగ్దానాలు గావించడం లేదు. అధికార్ల సమీక్షను వింటే, పత్రికల వార్తలు పూర్తిగా చదివితే విశదమయ్యే వాస్తవం ఇది. జనార్ధన రెడ్డి ముఖ్యమంత్రి అయి పదిహేడు నెలలు అయింది. పదవిలో స్థిరపడి నాల్గైదు మాసాలు కూడా కాలేదు. ఈ కొద్ది కాలంలో చేసిన వాగ్దానాలలో, వేసిన పునాది రాళ్ళల్లో పదిశాతం ఈ పాటికే నెరవేరడం తక్కువ అనుకోగలమా? కొందరు వేసిన పునాది రాళ్ల సమాధి రాళ్లై పోయింది చూస్తూ, కొందరి వాగ్దానాలు గాలిలో కలిసి పోయింది గమనిస్తూ, ఈపాటి అభివృద్ధి అయినా జరిగినందుకు ఆక్షేపించగలమా? నిర్ణేతలు ప్రజలే!

# గూడూరు టౌన్‌లో విపరీతంగా విద్యుత్ చోరీ ?

విద్యుత్ చౌర్యం అంటే ఏలా ఉంటుందో గూడూరు టౌన్‌కి వెళ్లి చూసి నేర్చుకోవాలంటున్నారు. సాధారణంగా కరెంట్ దొంగతనానికి పల్లెలు ప్రసిద్ధి. స్తంభానికి రెండు గడలు ప్రేలాడదీసి, మోటార్లు, గీజర్లు పనిచేయిస్తుంటారు. దానికి రైతులను తప్పు పట్టవలసిన పని కూడా లేదు మోటారుకు కనెక్షన్ ఇమ్మంటే అధికారులివ్వరు. సంవత్సరాల తరబడి సబ్‌స్టేషన్ల చుట్టూ తిరిగినా అప్లికేషన్ కదలదు. ఎంత కాలం పొలాలు బీడు పెట్టుకుంటారు? అందుకే వైర్లు తగిలించి విద్యుత్ చోరీ చేస్తారు రైతులు. దాన్ని చోరీ అనడానికి కూడా లేదు. కడప జిల్లాలో అయితే గ్రామాలకు గ్రామాలే కరెంట్ మీటర్లంటే ఎట్లా వుంటాయో ఎరుగవట. బజారులో చవకగా దొరికే జిఐవైరు చుట్టలు కొనుక్కుపోయి, చవకలనే స్తంభాలుగా పాతి, దర్జాగా కరెంట్ తెచ్చుకుంటారట. అదేమని అడగడానికి ఏ అధికారికి గుండెలు వుండవు; అడిగితే బాంబులు వస్తాయి. వారితో పోలిస్తే నెల్లూరు రైతులు చేసే తప్పు, తప్పు క్రిందే రాదు.

గూడూరు టౌన్‌లోని విద్యుత్ చోరీకి వినియోగదారుల కంటే, విద్యుత్ ఉద్యోగులదే బాధ్యతగా కన్పిస్తున్నది. స్లాబ్ పద్ధతిలో బిల్లులుండే మీటర్లను తిరగనివ్వకుండా చేసి, రీడింగ్ నోట్ చేసుకోవడానికి వచ్చినపుడల్లా మామూళ్లు దండుకపోతున్నారన్నది అభియోగం. ఈ చౌర్యం లక్షలలో వుందని చెప్తున్నారు.

ఆలస్యమయ్యేసరికి, వ్యత్యాసం వచ్చే మొత్తం భారీగా వుంటున్నది. దాన్ని చెల్లించలేక పోవడంతో చాలా కనెక్షన్లు పీకి పారేస్తున్నారు. తప్పు విద్యుత్ శాఖదయినా శిక్ష మాత్రం వినియోగదారుడికే పడుతున్నది. రాష్ట్రమంతా ఇదే సమస్య అయినా గూడూరు టౌన్‌లో మరీ ఎక్కువగా వుందంటున్నారు.

టౌన్‌లో సిబ్బంది సంఖ్యను పెంచి, రీడింగ్ సక్రమంగా తీయనిదే ఇటు వినియోగదారులు అటు సంస్థ కూడా నష్టపోక తప్పదు.

## జిల్లావార్తలు

### నారాయణ రెడ్డి పేట 7 తరగతి ఫస్ట్



నారాయణ రెడ్డి పేట జి.ప్ర.ప. హై స్కూలుకు చెందిన కుమారి బి. పద్మజ 7 తరగతి పరీక్షల్లో జిల్లాలో ఫస్ట్ ర్యాంక్ సాధించింది. ఆమెకు లెక్కల్లో 100, సోషల్ స్టడీస్‌లో 97, సైన్సులో 91, ఇంగ్లీషులో 94, తెలుగులో 92 మార్కులు వచ్చాయట. మొత్తం మీద నూటికి నూరు శాతానికి 21 మార్కులే తక్కువ.

ఇంతటి అసాధారణ ప్రతిభ కనబరచిన ఆ బాలికకు మా అభినందనలు.

### జయంపు సన్మానం

బాలాయపల్లి మండలం, జయంపులో శ్రీ కృష్ణ నాట్యమండలి తరపున పలువురు కళాకారులను సత్కరించారు. సభకు, ప్రసిద్ధ నటీమణి శ్రీమతి గూడూరు సావిత్రి అధ్యక్షించారు. ప సర్పంచ్ శ్రీ అందూరు పరంధామ రెడ్డి, విఎఒ శ్రీ గూడూరు సుధాకర రెడ్డి, శ్రీ పి. జయచంద్రారెడ్డి మాట్లాడారు.

కళాకారులు - డాక్టర్ కె. వి. శేఖర్, శ్రీ జయంపు కృష్ణ, శ్రీ వి. రమణారెడ్డి, శ్రీ బి. జయరామరెడ్డి; శ్రీ జె. సుందరయ్య, శ్రీ ఎ. కాలేషా, శ్రీ ఎ. అల్లీబాషా, శ్రీ ఎ. మస్తాన్ శ్రీ యాదవ ప్రసాద్, శ్రీ మల్లు రవి సభ నిర్వహించారు. చివర్న బాలనాగమ్మ నాటక ప్రదర్శన జరిగింది.

### సింగపేట నేత్రదానం

అల్లూరు మండలం, సింగపేటలో 22 తేది ఉదయం కేతిరెడ్డి వెంకట సుబ్బారెడ్డి (84) అనే ముదుసలి నుంచి నెల్లూరు నేత్రదాతల సంస్థ కళ్లను సేకరించింది. ఆయన బ్రతికున్నపుడే సంస్థకు రు. 500 లు విరాళమిచ్చి, తన మృతి తర్వాత తన కళ్లను విరాళంగా తీసుకోమని వ్రాసి ఇచ్చారట. 22 తేది రాత్రి అంతిమ క్షణాలు సమీపించగానే వారి కుటుంబీకులు సమాచారం అందించడం వల్ల - డాక్టర్ ఎ.వై.కృష్ణ, శ్రీ తిక్కవరపు సుకురామరెడ్డి సింగపేట వెళ్లి ఆయన మరణం తర్వాత నేత్రాలు సేకరించి, మద్రాసుకు పంపారు.



న్యాయవాది వివి రమణారెడ్డి కుమారుడు శ్రీనివాసులు రెడ్డి, వినయ; వివాహం 8 తేది నెల్లూరులో జరిగింది.





Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET printing at Nayagara Books Pvt. Ltd. Nellore.